ఆ నాడు పెళ్లిరోజు
అందించి మీ అభిమానం
పొందిన శ్రీరామ్
ఈ నాటి అభిరుచులకు
అనుగుణంగా
అందిస్తున్న
మంచి చిత్రం!

త్వరలో...!



ఎం.ఎస్.శ్రీరామ్ సమర్పించు
సూర్య చిత్ర కంబైన్స్....

# మంచిరోజు



సంగీతం-దర్శకత్వం:
ఎం.ఎస్.శ్రీరామ్
నిర్మాతలు:
ఎం.సత్యవతీదేవి
బి.రామకోటేశ్వరరావు
సువర్ణాఫిలింస్
రిలీజ్....






సురేష్ మూవీస్

మీ అభిమాన 'నవల'కు
అపురూప చిత్రకల్పన!

# సెక్రటరీ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: డి. రామానాయుడు
దర్శకత్వం: కె. ఎస్. ప్రకాశరావు



ఆంధ్ర: నవయుగ సీడెడ్: చక్రవర్తి పిక్చర్స్ నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

NVKR

# ఉత్తరాలు

## సినిమా

16-1-76 సంచికలో హిందీ తెలుగు తారలమధ్య జరిగిన క్రికెట్ పోటీ ఫోటోలు మిక్కిలి ఆనందాన్ని కలిగించాయి ఎడిటర్ దర్శకుడైన కె. కృష్ణతో ఇంటర్‌వ్యూ నాకు ఎంతో సినిమా పరిజ్ఞానాన్ని కలిగించింది అందులోనే నా తొలి చిత్రం "ఖైదీ బాబాయ్" అంటూ దర్శకుడు టి కృష్ణ తెలియజేశారు. ఆయన దర్శకత్వం వహించిన తొలిచిత్రం "ఉపాయంలో అపాయం" ఆయన తొలి చిత్రం ఆయనే మరచిపోవటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది పోతే సినిమా విశేషాల శీర్షిక ఎప్పటిప్పుడు నూతన స్టైలులో జనరంజకంగా నిర్వహిస్తున్న, 'శ్రీనివాస్' గార్కి అభివందనలు.

నల్లూరు శ్రీనివాసబాబు (న్యూటన్) పటమట

## ధర్మపథం

ధర్మపథం శీర్షిక, కె రామలక్ష్మిగారి ప్రశ్న జవాబులు చాల బాగుంటున్నాయి మరియు 'తుఫాన్' కథ చాలా బాగుంది.

జె. సంతోష్‌కుమార్ తిమ్మాపూర్

### గమనిక

"మినీ యింటర్‌వ్యూలు" అనేవి టపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యం కాదని మా యువ పాఠకులకు మనవి ... సం.




## కథలు

5-3-76 తేది భవానీ ముఖచిత్రంతో వెలువడ్డ సంచికలో శ్రీ కె వి యల్ నరసింహ శాస్త్రిగారి రచన నోటీసులు కథలో రచయితగారు రమణ పాత్రను పుట్టుక మూగవాడుగా చిత్రీకరించడం జరిగింది అయితే మూగవాళ్లకు సహజంగా చెవుడు కూడ వుంటుందని తనే కథలో రమణ బజారుకి వెళ్లి కిలో కంది పప్పు పట్టుకొస్తావా అని పలకమీద రాసేది అమ్మ అని చెప్పడం ద్వారా రమణకి సహజంగా మూగవాళ్లకి వుండే చెవుడితన్ని చిత్రించారు. సరికదా సుభాషిణి అంతే, మరి వాళ్లకు పుట్టిన పాప అదే బాబులేండి 'అత్త అత్తా అంటూ ఉయ్యాలలో అనటం ఏ రమణ, సుభాషిణిలు ఆనంద భాష్పాలు రాల్చారట ఇది ఎలా సంభవం

రజా కేశవరావు (చీపురుపల్లి)

* * *

16-4-76 ఆంధ్రపత్రికలోని సీపాలు హార్ట్ స్పెషలిస్టు, కథలు చాలా బాగున్నాయి.

సయ్యద్ హుసేన్, దేవరకొండ

### కార్టూనిస్టుల సావనీర్




ప్రఖ్యాత తెలుగు కార్టూనిస్టులు సృష్టించిన దాదాపు 125 కార్టూన్లతో, శ్రీయుతులు ఆరుద్ర, కొడవటిగంటి, రావి కొండలరావు వీరాజీ, పురాణం వెందలైన ప్రముఖుల సలహాలు సందేశాలతో, కార్టూనిస్టుల పరిచయం వారి వారి చిరునామాలు వగైరా అనేక ప్రత్యేక ఆకర్షణలతో వెలువడిన ప్రత్యేక సంచిక వెల రు 8 మాత్రమే ! ఇది నవోదయ పబ్లిషర్స్ - విజయవాడ, ఎ పి బి డి, సికింద్రాబాదు అవద అన్ని 'హిగ్గిన్ బాదమ్స్ బుక్‌స్టాల్స్'లోను లభ్యమవుతోంది కొందరు దొరకలేదని రాస్తున్నారు మాకు వ్రాసినారే ! మేమే పంపగలం వివరాలకు కారదర్శి టి సి సి 76, 3-6-102 - ఏ, బషీర్ బాగ్ - హైదరాబాద్ 29 పేర వ్రాయుమని కోరుతున్నాము

శంకు, హైదరాబాద్

# ఆంధ్రసచిత్రవారపత్రిక


వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938–1972]

శుక్రవారం 30–4–'76

నలనామ సం వైశాఖ శుద్ధ పాడ్యమి

*సంపుటము 69 సంచిక. 34*

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు 33–80

ఆరుమాసాల చందా – రు 16–90

విడి ప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక




అట్ట మీద

'సెక్రటరీగా' నాగేశ్వరరావు

**కథలు :**

ఆ సీత కథ ... 8

ప్రేమ మందిరం ... 29

కావ్! కావ్! ... 32

**సీరియల్ కథలు :**

వెలుగుబాట ... 12

కాలమిచ్చిన తీర్పు ... 19

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు–4, లోకంపోకడ–5, హైదరాబాద్ నోట్‌బుక్-6, ప్రశ్నావళి – 11, వారఫలం, రాలిన ముత్యాలు – 16, ఫాలాక్షు నిడైరీ – 38, ధర్మపథం –18 సినిమా–24, గాంధీకొండమీద మనకి చేరువగా నక్షత్రాలు–30, సామాన్యుని సణుగుడు–36, అవీ–ఇవీ–అన్నీ–46


లోకంపోకడ * టీమెన్









# మనలో మాట

దీపావళి చిన్న సీరియల్ కథలపై వ్యాస రచన పోటీలో ప్రథమ బహుమతి పొందిన



కె. వి. వి. బ్రహ్మానందరావు స్వంత ఊరు ధవళేశ్వరం. ఉద్యోగరీత్యా ఆరు సంవత్సరాలు గా విశాఖపట్నంలో నివాసం ఇంజనీరింగ్ లో డిప్లొమా పొందారు. నాలుగు సంవత్సరాలుగా కథలు, వ్యాసాలు, సమీక్షలు మున్నగునవి వ్రాస్తున్నారు. కీ శే బుచ్చిబాబు రచనలంటే అభిమానం ద్వితీయ



బహుమతి పొందిన సంపసి రామమోహనరావుగారు ప్రస్తుతం ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా సింద్రీ యూనిట్ లో శిక్షణ పొందుతున్నారు 1953 లో పుట్టారు బి యస్సి డిగ్రీ అందుకున్నారు స్వగ్రామం గుంటూరుజిల్లా నారాకోడూరు గ్రామం. "శ్రీ శ్రీ, రావిశాస్త్రి" గారి రచనలంటే తనకభిమానం అంటున్నారు తృతీయ బహుమతి పొందిన కుమారి



జొన్నలగడ్డ వేంకటలక్ష్మిగారు మద్రాసులో రాష్ట్ర భాషా హిందీ పారంగత్ చదువుకొంటున్నారు లోగడ చాలా వ్యాసాలు వ్రాశారు హిందీ లో కూడా రచనలు చేయాలని అభిలాష స్వగ్రామం తెనాలి పెయింటింగ్, డ్రాయింగ్ ఆమె సరదాలు

* * *

పరిశీలనకు కార్టూన్లు పంపేవారు వాటితోపాటు తగినన్ని తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామా గల కవరు కూడా పెట్టడం అవసరం మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్లు అందజేసేవారు యీ నిబంధన పాటించి తీరాలని మరోసారి విజ్ఞప్తి కార్టూన్ల పరిశీలనకు కనీసం ఆరు వారాలు పట్టవచ్చును.

# హైదరాబాద్ నోట్ బుక్

శ్రీ ఎల్ సత్యనారాయణ

ఇక యంత్ర సామాగ్రిని దిగుమతి చేసుకోకుండా, దేశవాళీ పరికరాలను వాడాలి అని ఎప్పుడైతే భారత ప్రభుత్వానికి అభిప్రాయం కలిగిందో అప్పటినుంచి మరుగున ఉన్న మాణిక్యాలన్నీ ధగధగ మెరుస్తూ ప్రత్యక్షం కావడం ప్రారంభమయింది అలాంటి మాణిక్యాలలో ఒకరు శ్రీ ఎల్ సత్యనారాయణ, ఈయనవల్ల భారత అణుశక్తి సంస్థ (ఎలెక్ట్రానిక్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా)కు మొన్నటి రిపబ్లిక్ దినోత్సవం నాడు వెండి కేడయ్యు, ఈయనకు 2000 రూపాయల నగదు బహుమతి లభించాయి, విదేశాల నుంచి దిగుమతి చేసుకొనే మెటల్ ఫిలిం రెసిస్టర్లకు ప్రత్యామ్నాయ సాధనం కనిపెట్టినందుకు అణుశక్తి సంస్థకు ఇలాటి బహుమానం రావడం ఇదే తొలిసారి ఈ ప్రత్యామ్నాయాన్ని శ్రీ సత్యనారాయణ కనిపెట్టి రూపొందించారు ఇది రక్షణ రంగాలకు, మరికొన్నిటికి అత్యంతోపయోగకరమైంది దీనివల్ల నాలుగు సంవత్సరాలుగా దాదాపు 50 లక్షల రూపాయల విదేశీ ద్రవ్యం ఆదా కలిగింది దీనిని ఇతర దేశాలకు ఎగుమతి కూడా చేయవచ్చు దిగుమతి ప్రత్యామ్నాయ బహుమతికి 63 సంస్థలు పోటీచేయగా, ఎనిమిది సంస్థలను ఎంపికచేశారు మెటల్ ఫిలిం రెసిస్టర్ల రూపకల్పనకు శ్రీ సత్యనారాయణ 1965 లో భాభా పరమాణు పరిశోధన కేంద్రంలో నారులు పోశారు. 1967 లో భారత అణుశక్తి సంస్థలో ప్రయోగాత్మకంగా దీని ఉత్పత్తి ప్రారంభమయింది 1974 కు ఈ ఉత్పత్తి ఏడాదికి 15 లక్షల మేరకు జరిగింది శ్రీ సత్యనారాయణ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అణుభౌతికశాస్త్రంలో ఎం ఎస్ సి లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై 1960 లో భాభా పరమాణు పరిశోధన కేంద్రంలో చేరారు విద్యార్థి దశలో అన్ని పరీక్షలలోను ప్రథమశ్రేణిలో వున్నారు 1967 లో అణుశక్తి సంస్థ నెలకొనడంతో, దానికి బదిలీ అయ్యారు 12 సంవత్సరాలుగా ఫిలిం రెసిస్టర్ల విభాగంలో పనిచేస్తున్నారు భారత ప్రమాణాల సంస్థ, అణుభాగ ప్రమాణీకరణ సంస్థల ఫిక్సెడ్ రెసిస్టర్ల సంఘాలలో సభ్యులు ప్రస్తుతం అణుశక్తి సంస్థ రెసిస్టర్ల విభాగానికి ప్రధానాధికారి 150 మంది ఈ విభాగంలో పని చేస్తున్నారు ఈయన క్రీడా నిపుణుడు, అణుశక్తి సంస్థ ఉద్యోగుల సంక్షేమ నిధిపక్షాన వివిధ క్రీడలు ఏర్పాటు చేస్తున్నారు, మొదటినుంచి రెసిస్టర్ల విషయంలో పరిశోధన, పరిశీలనల నిమిత్తం త్వరలో రష్యా, జర్మనీ, స్విట్జర్లాండ్ లలో పర్యటించనున్నారు మొన్నటి ఫిబ్రవరి 15 కు 36 నిండి, ఉత్సాహ స్ఫూర్తులలో తొణికిసలాడే శ్రీ సత్యనారాయణ 'ఇంకా రెండు ముప్పయ్యార్ల ఆరోగ్య భాగ్యాలతో విలసిల్లుతూ, ఇంకా ఎన్నో యంత్ర పరికరాలు కనిపెడతారని విశ్వసిస్తున్నాను.



ఉపశ్రుతి :

"నాన్నా తమ్ముడు అల్లరి చేస్తున్నాడు మాట వినడంలేదు" అన్నది నా మిత్రుని కుమార్తె

"నాన్న తిడతారన్నా వినడంలేదా ? అడిగాడు మిత్రుడు

"లేదు నాన్నా ."

"ఇంగ్లీషు మీడియంనుంచి తీసి తెలుగు మీడియంలో పడేస్తానని చెప్పు "

— తిరుమల రామచంద్ర



కళకళలాడే ముఖంపై కళ్యాణపు బొట్టూ
సిగ్గుతో కెంపులెక్కే బుగ్గపై నల్లని చుక్కా
ముఖమంతా కళ్ళు చేసే పచ్చకర్పూరపు కాటుకా
మెడలో బంగరు మంగళసూత్రం
మిలమిల మెరిసే నల్లపూసలూ
చేతికి పండిన గోరింటాకూ
కాళ్ళకు పారాణీ, వెండి మట్టెలూ,
ఎర్రని, పచ్చని గలగలలాడే గాజులూ
తెల్ల పట్టుచీరకు ఆకుపచ్చని అంచూ
పైన కనకాంబరపు జాకెట్టూ
నల్లని మేఘాల్లాంటి జడలో సూర్యరస్మిలా
లేత పచ్చని మొగలిరేకులూ పెట్టుకుని
పచ్చని కాపురాని కోసం
ఉవ్విళ్ళూరే వధువు

అంతా రంగుల మయం




రంగు మన జీవితంలో ఒక సమగ్రమైన భాగం—నెరొలాక్

U-GNA-15




సీత రాముడికోసం ఎదురుచూస్తూ కూచున్నది. శోభాయమానమైన పట్టు పరుపులు వేయబడిన రత్నకాంతులీనే కురిచీలలో కూచుందా సీత?— వాటి ఆకర్షణకీ సుఖానికీ ఎంతమాత్రం లొంగిపోని సీత ఎక్కడ కూచుందని? ఒక సామాన్యమైన ఒక చందనపు చెక్కతో తయారైన కిటికీలో కూర్చుని బయటికి చూస్తూంది.

ఒక విధంగా సీతకి అందులో కూచునే హక్కులేదు. పరిచారికలు ఆకస్మాత్తుగా ప్రవేశిస్తే ఇటువంటిచోట రాణులు కూచున్నట్లు గమనిస్తే హేళనగా చూస్తారు. అలా చులకనగా చూడబడటం ఏ అంతఃపుర కాంతారత్నానికీ యిష్టం కాదు. అందుకే వాళ్లు పొరపాటునైనా అలాటి పని చేయరు.

ఈ సీతాదేవి హృదయగత భావాలు తెలిసిన శ్రీరామచంద్రుడు సీతకు తగిన స్వేచ్ఛ యిచ్చేడు. వనవాసానంతరం పట్టాభిషిక్తుడైన రాముణ్ణి ఒక్క కోరిక కోరుకుంది సీత భార్యగా. తనకు ప్రకృతి సౌందర్యాపేక్ష తగ్గిపోలేదు సరికదా ఇంకా ఏదో వనవాస రక్తి మిగిలివుంది. ఈ రత్నవైఢూర్య తాపితమైన భవనాల కాంతులలో వెలుగునామె ఒక్కొక్కప్పుడు భరించలేకపోతుంది. రామచంద్రుడు సీత పెదవులనుంచి కోరిక బయట పడకుండానే ఆ కనులలోనే చదివేశాడేమో అన్నట్లు, సీత నివసించే అంతఃపుర భవనానికావల కిటికీల కెదురుగా అందమైనపూదోట వెలిసింది. ఆ వనంలో ఆడంబరమైన చిత్ర గృహాలు, కల్పిత లతా గృహాలు లేవు; వెండి అరుగులు, బంగారు పూతల ఆసనాలు లేవు. సహజ ఫల పుష్పాలతోను, శుక పికాదుల కలస్వనాలతోను, కలకలలాడే వనలక్ష్మి సౌందర్యాన్ని ఎన్నిసార్లు చూసినా తనివి తీరదు సీతకు. అందుకే భర్త రాకకు ఎదురు చూస్తూ, సృష్టి సౌభాగ్యాన్ని పరికిస్తూ

ఎనలేని ఆనందాన్ని అనుభవిస్తూంది.

కౌసల్యాదేవి అంతఃపురం నుంచి నేరుగా సీతకోసం ఆత్రుతగా వచ్చిన రాముడు — గుమ్మంలో అడుగు పెడుతూనే సీత అన్యమనస్కంగా కూర్చున్న తీరు ఆమె నిరాడంబర కోమల హృదయ సౌజన్యాన్ని తనివితీరా చూసి, అంతలో కదిలి, సీతను సమీపించేడు.

రామచంద్రుని చేతి స్పర్శకు పులకించి వాలుగా అతని వంక చూచింది సీత.

"స్వామీ! ఇంత ఆలస్యం చేశారు. అత్తగారు కులాసాగా వున్నారా? మీరు సభకు వెళ్లేవేళ అయినట్టుంది ప్రభూ!" అంది లేచి రాముని కభిముఖంగా నిలబడుతూ.

అతడు కిటికీలో నుండి సూర్యకిరణాలు చూచి "ఇంకా ఒక గంట ఇక్కడే వుండ వచ్చు సీతా! నీతో తియ్యని కబుర్లు నాలుగు చెప్పందే, సభలో నేను రాజకీయాలు వర్తించలేను ప్రియా!" ప్రేమదృక్కులు సీత పైకి ప్రసరింపచేశాడు.

'ప్రియా' అని రాముడు పిలవగానే సీత నునుబుగ్గలు ఎరుపెక్కాయి. "ఏమిటో ఈరోజు మీ ధోరణి కొత్తగా వుంది" అంది సీత తల వంచుకొని.

"నిజమే—సభలో ఎవరెన్ని విలువైన కిరీటాలూ, వజ్ర వైఢూర్యపు సింహాసనాలు, పచ్చల తివాసీలు, వాటి మిరిమిట్లు చూసి చూసి విసిగిన నా కళ్లకు నీ శాంతస్వరూపం, ఆడంబరాల్లేని అలంకరణ మనసుకు ఎంత గానో హత్తుకుపోయి నన్ను నేనే మరచిపోతుం టాను సీతా! అంతఃపురంలోని ఆడవాళ్ళు ఎల్లాలం ఏమైనా తక్కువా? అన్ని ఆభర ణాలు మోస్తూ తిరిగే ఆడవారిపై నాలాటి వారికి కాకపోతే మరెవరికి జాలి?—" చిరు నవ్వుతో అంటున్నపతిని చూసి.

"అయితే దేవరవారి మెడలో ఈ పచ్చల హారం ప్రదర్శనం వుండదు దేనికో?" అంది కొంటెతనంగా.

తననీలపు శరీరంలో ఇంచుమించు కలిసి పోతూన్న పచ్చలు పొదిగిన బంగారు హారాన్ని చూచుకొని ఒక్క క్షణం తెల్లబోయాడు రాముడు. "పురుషులు ఈ హారాలు మొద లైనవి వేసుకొని, కిరీటాల బరువు మోయ నక్కరలేని రోజు లెప్పుడొస్తాయో మరి?—" అన్నాడు.

"అదేమిటి - అలాటి రోజులొస్తాయా?"

"పిచ్చిదానా! ఇంత అమాయకురాలివి; నీవు లక్ష్మివని నమ్మలేకపోతున్నాను. కాని స్వతంత్ర భావ వాహినివిగా స్త్రీ లోకానికి ఆదర్శప్రాయమైనావులే."

సీత నవ్వింది. "లక్ష్మినో, మాయనో?— మీరు గుర్తు చేసేవరకు అమాయకురాలిగానే వుండపోతున్నాను. అదిసరే—అసలు విషయం మీ నోట చెప్పిరేరాలి!" అన్నది రాముని చేతులను తన చేతులతో పెనవేస్తూ.

"ఏది? ఈ హారం విషయమా? చెబు తాను. ఇలా శయ్యమీదకురా!"

రత్నాలంకారాలు ముత్యాల తోరణాలు కట్టిన పట్టెమంచం దగ్గరకు తీసుకువెళ్ళి, తాను పట్టుపరుపుమీద జరుగుతూ సీతను కూచోమన్నాడు రాముడు.

"ఇది మా నాన్నగారు. నేను పట్టాభి షిక్తుణ్ని కాబోతున్నాననే సంతోషంలో నా మెడలో వేసిన పచ్చలహారం. వనవాస జీవితం ముగియగానే తిరిగి మెడలో వేసుకున్నాను."

పరధ్యానంగా వున్న సీత గభాలున రాముడు చెయ్యిపట్టుకు లాగేసరికి సరిగా అతగాని వక్ష స్థలంమీద వాలిపోయింది. అవకాశాన్ని రాముడు విడిచిపెట్టక ఆమెను హృదయానికి అదుము కొని 'సీతా' అన్నాడు ప్రేమావేశాలు పెన గొనగా.

సీత కంగారుగా అంత వెలుగులో ఎవరైనా చూశారేమోనని అటూ యిటూ చూసింది. ఒక పార్శ్వాన తగిలించబడ్డ అద్దంలో సీతా రాముల ప్రతిరూపం పలుకరించింది. సీత సిగ్గుతో మొగ్గలా ముడుచుకొని రాముని చేతుల్లోనుంచి తప్పించుకొని బయటపడి రివ్వున అద్దం దగ్గరకు వెళ్ళింది. అద్దం మీదకు పట్టుతెర లాగి కుదుటపడ్డ మన సుతో తిరిగివచ్చి కూచున్నది.

"శయన మందిరాల్లో ఈ అద్దాలు ఎందుకనో నాకు నచ్చవు." అంది సీత పెదవులు ముడిచి.

రాముడు పకపకా నవ్వాడు. సీత పట్ల తప్ప అంతగా ఎక్కడా నవ్వనివాడు. ముత్యాలు రాలాయేమో అనిపించి కాసేపు పరవశించిన సీత అంతలో లేనికోపం తెచ్చుకుంది. "అలా నవ్వుతారేం?"

"అద్దంలోనివి మన ప్రతిబింబాలే కదా! స్త్రీలెంత సంకుచిత హృదయులో అని నవ్వొచ్చింది సీతా!"

"అంటే నన్నే అనండి మొత్తం స్త్రీ లందర్నీ అంటారెందుకని? అందులో మీకు పూజ్యులైన అమ్మగారు కూడా కలిసిపోతారు సుమా!"

"మా అమ్మ, సుమిత్రపిన్ని, కైక పిన్ని ఏమైనా తక్కువ వారా సీతా? వారిని వారు అస్తమానమూ కించబరుచు కుంటారు. ముందు యుగాల్లో స్త్రీలు అసలు తాము కించబరచుకోకుండా జీవించాలని నా ఆకాంక్ష."

"అత్తగారి కిప్పుడొచ్చిన తక్కువేముంది? ఆమె తనని తాను తక్కువ చేసుకునే పరిస్థితి అసలెప్పుడొచ్చింది స్వామి?"

"నీకు తెలీదు సీతా! ఉదయం లేచి మొ



# ఆ సీత కథ

గానే పాలు ఫలాలు తీసుకోవడానికి ముందు గానే ముగ్గురమ్మలనూ చూడబోతాను కదా! తల్లులందరూ నా దగ్గర విడివిడిగా తమ ఆవేదన వెళ్ళబోసుకున్నవారే. "సూర్యోదయ మవుతూనే, పక్కనుంచి లేస్తూనే — 'ఈ సౌభాగ్య హీనమైన మొగాలు' ఎందుకు చూస్తావు తండ్రీ. చందమామ లాటి సీత మోము చూసే వస్తున్నావు కదా!—" అంటూ తరచుగా ప్రశ్నిస్తారు. విధవకావడం విధిలిఖితం. విధినిర్ణయానికి ఎవరు బాధ్యులు? వాత్సల్యం ప్రేమ అనే ఆత్మీయ బంధాలకంటె వేరే శుభశకునా లేమున్నాయి? శుభశకునాలు చూచుకొని లేస్తే విధిరాసిన గీత చెరుగుతుందా? — ఈ మూఢ నమ్మకాలు నశించాలి సీతా! ఇవి ముందరగా అంతరించాలి —" నిట్టూర్చాడు రామరాజు.

"మీరు మరీ ఉపద్రవంగా మాట్లాడుతున్నారు. స్త్రీలకిప్పుడు వచ్చిన పెద్ద లోటేముంది?—"

"స్త్రీలకు జరుగుతున్న అన్యాయాలు అన్యాయాలుగా కనపడక పోవడమే గొప్ప దురన్యాయం. తాటకిని చంపవలసి వచ్చిన నాడెంత బాధపడ్డానో, అహల్యను చూసి ఎంతగా కరిగిపోయానో నీకర్థంకాదు సీతా! మండోదరి మహా సాధ్వి. ఆమెకీ అన్యాయమే జరిగింది విధిప్రేరణవల్ల. ఏ కారణంగానైనా స్త్రీలకు అన్యాయం జరగకూడదనే ధర్మాన్ని ప్రజల్లో ఎలా వ్యాపింప జేయాలా అని నిరంతరం ఆలోచిస్తున్నాను."

ద్వారంవద్ద అలికిడికి ఇద్దరూ తలఎత్తి చూశారు. సీత రామునికి కాస్త దూరంగా జరిగి నిలబడి "ఎవరక్కడ? రావొచ్చు!" అంది.

పరిచారిక వచ్చి పూలమాలలున్న బంగారు పళ్లెం వెండి పీఠంమీద వుంచి వెళ్లింది. దాస దాసీజనం నిర్భయంగా వచ్చినా, సంతోషంగా వచ్చినా సీత మందిరంలోకే. వాళ్లకు పవిత్ర పూజామందిరమది.

ఒక పూలమాల నాగరం మీదుగా జడలో ముడుచుకొంది సీత. పళ్లెంలో ఒక పెద్ద మాల సీతను ఆకర్షించింది.

"ఎవరు కట్టిన మాలో? ఎంత సొగసుగా వుందో చూడండి" అన్నది మురిసిపోతూ.

"ఏదీ?—" అని అందుకున్న రాముడు త్రుళ్లిపడి ఆపళాన హారాన్ని సీత మెడలో పడవేశాడు.

సీత సిగ్గుల పెళ్లికూతురై ఓరగా చూస్తూ "మరీ కొంటెతనం ఎక్కువైంది మీకు. సింహాసనం అధిష్టించినా నా దగ్గర చిలిపితనం పోలేదా? అయినా ఈ హారాన్ని ముట్టుకొంటూ అలా తుళ్లి పడ్డారేం?"

"సీతా! అదంతా ఇప్పుడెందుకు?— ఇంకేమైనా కబుర్లు చెప్పు." అన్నాడు ఆమె బుగ్గపై చిటికవేస్తూ.

"నాదగ్గర కూడా మీకు దాపరికాలున్నాయన్న మాట!"

"ఉండకూడదని ఏమైనా నియమమా? నేను స్త్రీకి బానిసను కాను. కాని—పురుషులకి స్త్రీలు బానిసలు కారాదంటాను, అయినా సాధారణ మనుషుల్లాగా నాచేత ప్రగల్భాలెందుకు పలికిస్తావు సీతా?—"

"మీకు నామీద నిజంగా ప్రేమవుంటే... అసలు సంగతి చెప్తారు"

"ఈ యుగంలో చెప్పదగనిది."

"సరే!— మీ యిష్టం" సీత ముఖం జేవురించడం చూసి శ్రీరామచంద్రుడు చిరునవ్వు నవ్వాడు. "సీతా! కోపంవద్దు."

చివరికి రఘురాముడు సీతాదేవి కన్నుల్లోకి చూస్తూ "ఆదండ పరస్త్రీ హస్తస్పర్శలాగ తోచింది దేవీ!" అన్నాడు.

ఉలికిపడింది. "పూలమాలేమిటి? పరస్త్రీ ఏమిటి? నాకేమీ అర్థంకాలేదు."

"చెప్పక తప్పదా?—"

"తప్పదూ—" అంది గోముగా.

"ఈ మాల అల్లిన యువతి నన్ను ప్రేమిస్తోంది సీతా!"

సీత ఒక్క క్షణం కలవరపడింది. "మీ రాజ్యంలో ఎవరు మమ్మల్ని ప్రేమించడం లేదని?—" అంది తేరుకుంటూ.

"ఆ ప్రేమ వేరు, ఈ ప్రేమ వేరు."

"అయితే ఒక పని చేస్తాను. ఆ కన్యను తెచ్చి మీకు వివాహం చేస్తాను."

"చాలా గొప్పపని చేస్తావు. నీవు త్యాగశీలి వనిపించుకోవాలి అనే ఆరాటం తప్ప, స్త్రీ లోకానికి బహుభార్యాత్వంవల్ల కలిగే కష్ట నష్టాలను ఆలోచించటంలేదు."

"రా రా జు లెందరో. ఎంద రెందరో రాణుల్ని ఏలలేదా?"

"ఇకముందు అలా జరగరాదు."

"మామగారు ..." సంకోచిస్తూన్న సీతను ఆపి.

"అంతఃపురంలో విధవలుగా బొమ్మల లాగా, రాలిన పూలలా విలపిస్తున్న అమ్మలను తలచిచూడు. ఆయన సంతుకోసమో, సంతోషం కోసమో చేసిన పనికి ఫలితం వీరి దుఃఖం."

"కాని ఒకరిద్దరు భార్యలుంటే పెద్ద నష్టముండదు."

"సీతా!" రాముడి గర్జనకు తుళ్లి పడింది.

హడలిపోయిన సీతను దగ్గరకు తీసుకుంటూ "ఈ రాముడు కోరికలు తీర్చుకోడానికి పుట్టలేదు సీతా! అంత మాత్రానికి మనసు, ప్రేమ, వలపు తెలీని మూర్ఖుడిగా అనుకోగలవా? ఈ ప్రశ్నకి నీవే సరియైన సమాధానం చెప్పగలదానివి."

ఏవేవో తలపులతో సీత మొగం రాగ రంజిత మైంది.

బరువుగా కనురెప్పలెత్తి ధైర్యం తెచ్చుకుంటూ "మీరు ఏకపత్నీ వ్రతులుగా ఎంత గొప్పవారైనా లోకం మిమ్మల్ని నిందించక మానదు. ఎందుకనుకున్నారు? నన్ను అగ్ని పరీక్షకు నిలబెట్టినందుకు." అన్నది.

"నేను ఆదర్శమూర్తినని పొగడుకోలేదే? —ఏ చిన్న ఆదర్శానికైనా ఎప్పుడూ అవరోధాలుంటాయి. మానవత్వాన్ని అభిలషించి అభిమానించే నన్ను రాజధర్మం ఇట్టా కట్టిపడ వేస్తూంది అడుగడుగునా .. రాజ్యంలో మహర్షులు పండితులు వున్నారు. చదువు లేని మూఢులూ వున్నారు. చదువురాని వారికి చర్యలే అర్ధమౌతాయి. స్త్రీ హింస యిష్టంలేని నాకు తాటకిని చంపక తప్పింది కాదు. మానవత్వాన్ని ప్రేమించే నేను అగ్నిలో దూకే నిన్ను ఆగమనలేకపోయాను."

"అగ్నిపరీక్షకు నేను నిలబడకపోయి వుంటే ఏంచేసేవారో?" సీత కొంటెతనం పెదవులపై నాట్యం చేసింది.

"నా సీత ఎంత అభిమాన వంతురాలో చాటిచెప్పి సంతోషంగా స్వీకరించి వుండే వాడిని. అయినా స్త్రీలకంత సాహసం ఇంకా ఎక్కడిది సీతా?"

"అప్పుడు మీరు మంచివారు. నేను చెడ్డదాన్ని అయివుందుము." అంది సీత పెదవుల్లో చిరునవ్వును దాచుకుంటూ.

"ఆత్మాభిమానం వుండే చెడ్డవాళ్లెలా అవుతారు?"

"అయితే నేను అభిమానవంతురాల్ని. ధీరురాల్ని అనిపించుకునే అవకాశం పోగొట్టుకున్నానంటారు. ఏమైనాసరే స్వామీ నాకు మరో అవకాశం మీరివ్వాలి."

"తథాస్తు! మాటల్లో నన్ను కట్టిపడేస్తున్నావు ... అవతల రాచకార్యాలే లేకపోతే నీకు తగిన శిక్ష వేసివుండేవాణ్ణి.' '

"చాలు చాలు. ఆవేశాలు—" దూరంగా జరుగుతూ "మీకు సభకు వెళ్లే వేళైంది. నేను అత్తగారిని దర్శించుకుంటాను." అంది సీతామహాలక్ష్మి.

సీత ముంగురులు సవరించుతూ లేచి నిలుచున్నాడు రామచంద్రమూర్తి.

పూర్ణ చంద్రబింబాన్ని నీలమేఘం విడిచి దూరం జరిగినట్లుందా ప్రదేశం.

సీత నిట్టూర్పు వి డి చిం ది. ప్రేమ, ఆరాధన, ఆలోచన, ఆవేదన ఆ నిట్టూర్పు లోంచి వెలువడి ప్రపంచ వ్యాప్తం కావడానికి బయలుదేరేయి,

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

కె. ఎస్. — చీరాల.

కథతోపాటు హామీ పత్రం పంపాలని రాశారు హామీ పత్రం ఎలా వుంటుందో వివరిస్తారా?

ఎలావుంటుందో నమూనా తెలియదుగాని ఈ కథ నా స్వంతం, ఏ కథకూ కాపీకాదు. (నా కథకే కొత్త కాపీకాదనీ, యింకో పత్రికకు కూడ పంపితే పంపాననీ, లేకుంటే లేదనీ కూడారాయడం అవసరమేమో యిలాంటివన్నీ యీ మధ్య ఎక్కువ అయ్యాయని సంపాదకులు అనుకుంటున్నారు) అని రాస్తే చాలు.

ఎమ్. వి. ఆర్., విజయవాడ

ఎదురుపడినా ఒకప్పుడు తెలిసినవాళ్లు పలకరించరు. గొప్ప అనుకోవాలా? చూడలేదేమో అనుకోవాలా?

మనసెక్కడో వుంటే కళ్లు గుడ్డివే అవుతాయి.

ఎస్. ఎస్. ఆర్. ఓబిలి

మీరు స్త్రీలకి అనుకూలంగా జవాబు లిస్తారు. మీరు స్త్రీగా పుట్టినందువల్ల. అదే పురుషునిగా పుట్టివుండి పురుషులకి అనుకూలంగా వాదించేవారేమో.

వాదించను తనసాటి మనిషిగా మాత్రమే ఆడదాన్ని గౌరవించి, ఆమె కష్ట సుఖాలు పంచుకొనే సహృదయునిగా రసేదాన్నేమో!

ఎస్. ఎస్. ఎమ్. గుంటూరు

మీ ఎదుట మిమ్మల్ని ఎవరేనా దూషిస్తే సహించకలరా కె రగారూ.

"ఎదుట పొగిడినప్పుడు భరించలేనిది తిడితే ఎందుకు భరించను మనసా, వచ్చినట్టు విను. నాకు నేనే బుద్ధి చెప్పుకుని చిరునవ్వుతో వినేస్తాను. (మనలో మనమాట ముఖం ఎదుట ఉన్న అభిప్రాయాన్ని ఉన్నట్టు ఎందరు చెప్పగలరు? వెనక కావలిస్తే వెయ్యి వాగుతారు కాని!)

ఎస్. ఎస్. ఎస్. డి. — విజయనగరం.

నేటి వరకట్నాల గురించి మీ ఉద్దేశ్యం?

ఏది చట్టసమ్మతం కాదో అది అవశ్యం విసర్జనీయం.

ఎమ్. ఆర్. వి. పి. — భువనేశ్వర్.

పవిత్రత అంటే ఏమిటి?

ఏంలేదు బురదలో పుట్టినా, బ్రతికినా కమలం లాగా స్వచ్ఛంగా వుండకల్గడం

పి. జె. ఆర్. — హైద్రాబాదు.

తల్లిగర్భం భారం అనుకుంటుందా? బాధ్యత అనుకుంటుందా?

సరదాగా మోస్తే భారం అనిపించదు బాధ్యత అని మోస్తుంది.

పి. ఎన్. ఎమ్. — కొత్తపల్లి.

మీకు ఉడుకుబోతుతనం హెచ్చేమో అనిపిస్తుంది. మీకు కారం అంటే చాలా రుచి అనుకుంటాను.

ఉడుకుమోత్తనం ఎడాల్‌సెంట్స్‌కి ఉంటుంది. నా కెందుకుంటుంది? ముప్ఫయి ఏళ్ళకు పైగా యీ అరవ తిండితిని కారం అంటే భయం—మరింకో థియరీ ఆలోచించండి.



# వెలుగుబాట

పి.వి.బి. శ్రీరామమూర్తి

*(గత సంచిక తరువాయి)*

"ఎలా సాధ్యం రాజా! మనసు అనేదాన్ని మన యిష్టం వచ్చినట్లు త్రిప్పుకోవడానికి అది చిన్నపిల్లలాడుకొనే ఆటవస్తువేంకాదు. వయసు తెచ్చిన కల్లోలాన్నీ, మనసు సృష్టిస్తున్న సంక్షోభాన్నీ ఎదుర్కొనే శక్తే వుంటే మనం ఇంతగా బాధపడనవసరంలేదు. కానీ రాజా అయిపోయింది. ఏ ఆశలతో ఆనంద సౌధాలను నిర్మించుకున్నానో, ఆ ఆశలు పునాదులతో కూలిపోయాయి. ఏ కోర్కెల కౌగిలిలో పరవశించి పోయానో. అవే నన్ను కోటి సర్పాలై కాటువేస్తున్నాయి. ఎవరు నా జన్మకు కారకులో వాళ్ల పంతాలకి, పట్టుదలకి నా జీవితం కాలిపోతోంది. కాలిపోనీ రాజా. దానికి నువ్వేం చెయ్యగలవ్? నువ్వు నాలాటి అసహాయుడివే. కాని — నా నుంచి నావాళ్ల నుంచి నీ జీవితం కూడా కాలిపోతున్నదనే నా బాధ." నిరాశా నిస్పృహాలు ధ్వనిస్తున్న గొంతుతో అంది వాణి.

అయిదునిమిషాలు గడిచిపోయాయి. ఎవ్వరూ మాటాడలేదు. వచ్చినపని అయిపోయిందని పించింది రాజుకి. ఇంకా అక్కడ ఎక్కువసేపు ఉండటం అనవసరం అనిపించింది రాజుకి. అతని శరీరంనెరవేరని కోర్కెలతో కాలిపోతోంది. అతను మనసు పిప్పి చేస్తున్న ఆశలతో నలిగిపోతోంది. అలాటి తరుణంలో "వాణీ. నేవస్తానింక" అని లేవబోయాడు.

"అప్పుడే దూరమై పోతున్నావా రాజా?" అని దీనంగా, వేటగాని చేతిలో చిక్కుకు పోయిన లేడిపిల్లలా చూస్తూ అతని చేతిని తన చేతిలోనికి తీసికొని గట్టిగా ముద్దు పెట్టుకుంది. "బహుశ ఇదే మన ఆఖరి ముద్దు కావచ్చు." అని అంటున్న వాణికి రాజు శరీరం వేడిగా ఉన్నట్లు అప్పటికి తెలిసి "రాజా! వొళ్లు కాలిపోతోందేమిటి? జ్వరం వచ్చిందా? ఇప్పుడు లాడ్జికి వెళ్లలేవు. ఈ రాత్రికి ఇక్కడే వుండిపో" గాభరాగా అంది రాజు నుదుటిపై చెయ్యి వేస్తూ వాణి.

"ఉండిపో రాజా! మంచం తెస్తానుండు" అంతవరకూ అచేతనంగా కూర్చున్న కృష్ణవేణి అక్కణ్ణుంచి లేచి వెళ్లింది మంచం తేవటానికి.

"వద్దమ్మా. నాకేం జ్వరంలేదు. నేవెళ్లిపోగల్ను." అని ఎంత చెప్పినా వినక, తూలి పోతున్నట్లు నడుస్తూ వెళ్లిపోతున్న రాజునే చూస్తూ వుండిపోయారు అక్కా చెల్లెళ్లిద్దరూ.

ఆ తరువాత—

రామచంద్రరావుగారి ఆస్తి, అంతస్తూ ప్రతిబింబించే లాటి అందమైన పందిట్లో పెద్ద పెద్ద హోదాల్లో వుంటున్న ఆఫీసర్లు యింటి ముందు వరుసలలో నిల్చివున్న కార్లు అతని దగ్గర పని చేసిన పోలీసు ఆఫీసరులు, పోలీసులు యింకా అతని దగ్గర పనిచేస్తున్నట్లే వినయంగా అతనికి సహా సహకారాలు చేయసాగారు. పెళ్లి పందిరి, ఆడ, మగ పెళ్లివాళ్లతో కళకళలాడుతోంది.

పెళ్లి పీటలమీద కూర్చున్న రామకృష్ణను ప్రక్కనే తల వంచుకుని కూర్చున్న వాణిని తదేకంగా చూస్తూ ఓ మూలన స్తంభానికి అంటుకుపోయి నిలుచుండిపోయింది కృష్ణవేణి.

వాళ్లిద్దరూ రెండు రూపాలలో, రెండు భావాలలో కనిపించారు కృష్ణవేణికి. ఒకరి కళ్లలో వెండి వెన్నెల వెలుగులు. మరొకరి కళ్లల్లో అనంతమైన చిమ్మ చీకట్లు. ఒకరి మనసులో ఆనందనయాగరాలు. మరొకరి మనసులో శోకసాగరాలు. కోటి స్వప్నాలు ఫలించబోతున్న తొలి రోజు మధుర ఘడియల కోసం తహతహతో ఒకరు. కోటి సర్పాలు కాటు వేస్తున్నంతటి భయంకరమైన తొలి రోజును తప్పించుకోలేక ఆవేదనతో ఇంకొకరు. కలలు కంటున్న కమనీయమూర్తి ఒకరు. కాలిపోతున్న కర్పూరపు బొమ్మ మరొకరు. వికసిస్తున్న కుసుమం ఒకరు ముకుళించుకుపోతున్న పుష్పం మరొకరు. కోర్కెల పల్లకిలో ఒకరు. నిట్టూర్పుల వడగాడ్పులలో ఇంకొకరు.

"కృష్ణా! నాకొంచెం హెల్ప్ చేస్తావా?" అన్న రాజు ప్రశ్నతో ఈ లోకంలో పడిన కృష్ణవేణి మరి ఆ దృశ్యాన్ని చూడలేక అక్కణ్ణుంచి వెళ్లిపోయి, పేకెట్స్ పిన్ చేస్తున్న

రాజుకు తనూ సాయపడింది. పేకెట్లను తొందర తొందరగా పిన్ చేస్తున్న రాజునే చూడసాగింది. మబ్బుల్లో ఉంటున్న చంద్రుడు లాగా కనిపించాడు. 'రాజుతోనే అక్కయ్య అనుకున్నట్లుగా పెళ్ళి జరిగి ఉంటే తనెంత సంబర పడిపోయే దీపాటికి?' అన్న ఆలోచన తోపాటు ఒక్క కన్నీటి బొట్టు కూడా రాలి చెక్కిలి మీద నిల్చింది కృష్ణవేణికి.

* * *

బి. ఎస్సీ ఫస్టియర్ తరువాత వేసవి సెలవలకి విజయవాడలో ఉంటున్న అక్క దగ్గరకు వెళ్ళింది కృష్ణవేణి. కృష్ణవేణికి సెలవల్లో హాయిగా గడుపుదామన్న కోరిక కంటే అక్క సంసారం ఎలాగుందో చూడాలన్న ఆత్రతతోనే విజయవాడ వెళ్ళింది.

అక్కడున్న ఇరవై రోజుల్లోనూ తన అక్కా బావా ఒకరోజయినా అన్యోన్యంగా మాటాడుకోవటంకాని సరదాగా కబుర్లు చెప్పుకోవటంగాని కృష్ణవేణి చూడలేదు. ఒక్కొక్క రోజు రాత్రిపూట భోజనానికి యింటికికూడా వచ్చేవాడు కాదు రామకృష్ణ. ప్యూన్ వచ్చి కేరియర్ పట్టుకుని వెళ్ళేవాడు. రామకృష్ణ ఎలాటివాడో తెలుసుకుందామని పించి ఒకసారి ఏదో పత్రిక చదువుకుంటున్న అక్కదగ్గరకు వెళ్ళి కూర్చుంది కృష్ణవేణి. కృష్ణవేణి రాగానే పత్రిక ప్రక్కన పడేసి లేచి కూర్చుని "ఏం కృష్ణా!" అంది.

"ఏం లేదక్కా!" అని వాణి ముఖంలోకి చూసింది. వెనుకటి కళాకాంతులు కాని, చిలిపితనంకాని, చలాకీతనం కాని కనిపించటం లేదు. నలభై ఏళ్ళు దాటిన స్త్రీలో కనిపించే గంభీరత కనిపించింది.

"అక్కా! నే నో టడుగుతాను. నిజం చెపుతావా?"

"ఏమిటి కృష్ణా!"

"నువ్వింకా మారలేదా?"

తలవంచుకుని పూరుకుండిపోయింది వాణి.

"బావగారు భోజనానికి కూడా యింటికి రారా?"

"అర్జంటు పనులున్నపుడు రారు."

"ఆయనెలాటి వారు? నువ్విలా వైరాగ్యంగా అస్తమానం కనిపిస్తుంటే ఆయనకి చికాకు కోపం రావా?"

"ఏం రావు. ఆయన చాలా మంచివారు. పాపం నాలాటి అభాగ్యురాల్ని జీవిత భాగస్వామినిగా చేసుకొని 'నేను తనతో సమంగా ఎడ్జెస్ట్ కాలేకపోతున్నా'నని ఎవరితోనూ చెప్పలేక తనలోనే కుమిలి పోతుంటారు. ఆ విషయం తలచుకుంటే మాత్రం నాకు చాలా బాధగా వుంటుంది."

"బావగారికి నీ విషయం తెలుసా?"

"నాకు తెలియదు. నేను మాత్రం చెప్పలేదు. ఒకసారి పుట్టిన రోజుకి రాజు బావగారి ఎడ్రస్‌కే గ్రీటింగ్ పంపినపుడు మాత్రం అడిగారు 'అతనెవరని?' అప్పుడు చెప్పాను రాజు గురించి. నేను చెప్పినదానికంటె ఎక్కువ తెలుసని నేను అనుకోను. కాని ఏది ఏమైనా, ఆయనింటికి వచ్చేసరికి నేను నవ్వుతూ కనిపిస్తే మాత్రం ఆయన ఆరోజు పండుగంత సంబరపడిపోతారు. ఈ దురదృష్టవంతురాలికి అదొకటే అదృష్టమేమో!" అక్క మాటలు విన్న తరువాత పాత జీవితాన్ని మరచిపోలేక ఎంత బాధను తనలో యిముడ్చుకుని బ్రతుకుతోందో పూహించుకొనేసరికి కృష్ణవేణికి మనసంతా వికలమైపోయింది.

ఆ తరువాత కొద్ది రోజులలోనే అక్కణ్నుంచి బయలుదేరి యింటికి వచ్చేసింది కృష్ణవేణి.

* * *

అక్కయ్య జీవితంలో ఎలాటి చిత్రవధ ననుభవిస్తోందో, గతం మరచిపోలేక మనసిచ్చిన వ్యక్తిని పొందలేక సంసారం సాగించలేక సతమతమైపోతూ, సమస్యల సముద్రంలో తలమునకలవుతూ ఎలా బ్రతుకుతున్నదో పూహించుకునేసరికి చెప్పలేనంత భయం వేసింది కృష్ణవేణికి. తండ్రిదగ్గర భయానికి అతనితో ఎదురుతిరగలేక తను కూడా అలాగే తల ఒగ్గి మాత్రం జీవించలేననిపించింది కృష్ణవేణికి. ఈ ఒక్క విషయంలో తాను ధైర్యంగా ఎదుర్కొన్నట్లయితే జీవితాంతం వెలుగుబాటలో పయనించవచ్చు. పిరికితనంతో తండ్రి బెదిరింపులకి, బుజ్జగింపులకి లొంగిపోతే మాత్రం అంధకారం ఆవరించిన జీవితం సాగించక తప్పదు.

'ఏది ఏమైనా తన వివాహం తన యిష్టం పైనే జరగాలి!' అని నిశ్చయించుకుంది కృష్ణవేణి.

ఆ మర్నాడు —

ఒంటరిగా కాలేజీకి నడిచి వెళుతున్న కృష్ణవేణికి సైకిలు మెల్లగా తొక్కుకుంటూ వెళ్ళిపోతున్న గోపాలం కనిపించాడు. అడుగులలో వేగాన్ని హెచ్చించింది. గొంతు కొంచెం గట్టిగా సెకలించింది. గోపాలం వెనక్కి తిరిగి చూసాడు. ఆగమన్నట్టు కళ్ళతో సైగ చేసింది కృష్ణవేణి. గోపాలం సైకిలు దిగి మెల్లగా నడవసాగాడు. కృష్ణవేణి అతన్ననుసరించింది.

"ఏంటి సంగతులు?" ప్రశ్నించింది కృష్ణవేణి.

"ఏమున్నాయ్. మీరే చెప్పాలి."

"ఎక్కడా కనిపించటం కూడా లేదే?" అని ఎవరో వెనకాతలనించి వస్తున్నట్టు గమనించి, "సరే. సాయంకాలం" ఓసారి బీచ్ వేపు రాగలరా? "తప్పకుండా." "సరే. మీరు వెళ్ళండింక." గోపాలం సైకిలెక్కి వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం గోపాలం, కృష్ణవేణి బీచ్‌లో కలుసుకున్నారు. కృష్ణవేణి మనసులో వర్ణనాతీతమైన ఆందోళన. కృష్ణవేణి అనుకొంది. 'ఇన్నాళ్ళూ గోపాలం కూడా ఇలాటి ఆందోళనే అనుభవించి ఉండాలని.' తన అభిప్రాయాన్నీ, నిర్ణయాన్నీ గోపాలంకి చెప్పబోయేముందు చాలా తీక్షణంగా ఆలోచించి, గోపాలంముందు తను మాత్రం బయట పడకూడదని అనుకుంది కృష్ణవేణి.

"నన్ను చూస్తేనే కవిత్వం వస్తుందన్నారుకదా, ఇన్నాళ్ళబట్టి పరిచయం ఉన్నా మీరింకా కవికాకపోవటం ఆశ్చర్యంగానే ఉందే!" అని పక పకా నవ్వింది కృష్ణవేణి.

*జరిగినకథ*. 3 గోపాలం వ్రాసిన ప్రేమలేఖను అందుకొంటుంది రిటైర్డ్ పోలీసు ఆఫీసరు రామచంద్రరావుకూతురు కృష్ణవేణి. గోపాలంబావ, తన తండ్రికి రాసిన ఉత్తరంలో తన ఊసులేదన్న వ్యధలో చిన్ననాటి ప్రేమ గుర్తుకొస్తుంది కమలకి. తండ్రి తెచ్చిన సంబంధం యిష్టంలేదని ఖండితంగా తల్లి రాజ్యలక్ష్మితో చెప్పి, అక్క వాణిలా తన జీవితం కాకూడదని కోరుకుంటుంది కృష్ణవేణి. తన సాయంతో చదువుకుంటున్న రాజు వాణిల ప్రేమను తండ్రి తిరస్కరించటం గుర్తుకొస్తుంది కృష్ణవేణికి.

# వెలుగుబాట




"అలాగ మీరు అప్పుడప్పుడు కనిపించినంత మాత్రాన కవిత్వం రాదు. మీరు పూర్తిగా నా దగ్గర వుండిపోయినపుడు, మిమ్మల్ని చూస్తూ నేను పరవశించి పోతున్నపుడు కవిత్వం దానంతట అదే వస్తుంది!"

"ఊహుం!... మరి ఆ పరవశించేదెప్పుడో" అలా గంటున్నపుడు ఆమె గొంతులో వలపు మధురిమలు తొణికిసలాడాయి.

"మీ అంగీకారం తెలిసినపుడు."

"నా అంగీకారం, మీ కిష్టమైనపుడు మీ పెద్దల ఆశీస్సులు లభించగలవా?'

కొంతసేపు ఊరుకొని "లభించవు. వాటిని ఆశించటం కూడా పొరపాటే."

"వాళ్ళని వ్యతిరేకించి మనం సుఖపడగల మనే ధైర్యం మీకుందా?"

"ఎందుకు లేదు? పెళ్ళి అనేది మనిద్దరికి సంబంధించిన విషయం కాని వాళ్ళ జోక్యం చేసుకోవలసిన విషయంకాదు. వాళ్ళ నిర్ణయాలు మారికుండవచ్చు. అందుకోసం మనం బలైపోవాలని లేదుగా!"

"వాళ్ళు పెద్దవాళ్ళు. మనం తీసుకున్నంత తేలికగా వాళ్ళీ విషయాన్ని తీసుకోరు. అందరూ మనకే నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తారనుకోండి. అప్పుడు మనం చెయ్యగలిగిందేముంటుంది?"

"నచ్చచెప్పినంత మాత్రాన లొంగిపోవటానికి మనమేం చిన్నపిల్లలంకాదు. మనకి వ్యక్తిత్వాలు లేకపోలేదు. అంతగా వాళ్ళు మనని వ్యతిరేకించినపుడు రిజిస్ట్రీమేరేజ్ చేసుకోవచ్చుగా!"

"సరే. మీకో విషయం చెప్పాలనే రమ్మన్నాను. నాకు మా నాన్నగారో సంబంధం చూసారు. మెడిసిన్ చదువుతున్నాడు. మన సెలాటిదో కాని మనిషి మాత్రం బాగున్నాడు ఫొటోలో."

గోపాలం కళ్ళుబైర్లు కమ్మినట్లయాయి. అంతవరకూ తన ఆశలు నెరవేరుతున్న రోజు ఆసన్న మౌతున్నందుకు సంతోష పడుతున్న గోపాలం ఈ వార్త వినేసరికి పూర్తిగా నీరసంగా అయాడు.

"ఇప్పుడు మనం ఏ నిర్ణయం తీసుకున్నా ముందు బాగా ఆలోచించుకోవాలి. ఈ పరిస్థితిలో మీరు మీ వాళ్ళని ఎదిరించాలి. నేను మా వాళ్ళని ఎదిరించగల్గాలి. అందుకు ధైర్యం కావాలి. ఈ విషయమై మరోసారి బాగా ఆలోచించుకుని నాకు చెప్పండి. నేను ఇంకా బాగా ఆలోచించుకోవాలి!" అని చెప్పింది కృష్ణవేణి. ఆడది అయినా ఆవేశం ఎంత మాత్రంలేక ప్రతి విషయాన్ని ఎంతో సునిశితంగా ఆలోచించే కృష్ణవేణిని చూస్తుంటే తన కంటే ఆమే ఎంతో ఉన్నతంగా కనిపించింది గోపాలానికి.

* * *

"హాయ్! కృష్ణా! ఏమిటీ అకాలాగమనం?" పట్టలేనంత ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని వ్యక్తంచేస్తూ గట్టిగా రెండు చేతులతో కృష్ణవేణిని చుట్టేసిందిమయూరి. కృష్ణవేణి కూడా మయూరిని చూసి అలాటి అనుభూతినే పొంది "ఎన్నాళ్ళకి కలుసుకున్నామే మళ్ళీ" అన్నది.

"అబ్బ. పోన్లేవే. పోయినవన్నీ పొందినంత తృప్తిగా వుందిప్పుడు" అని "రా. ఎవ్వరూ లేనప్పుడే వచ్చావు. మంచి టైము చూసుకుని. హాయిగా గడపవచ్చులే." అని లోపలికి తీసికెళ్ళింది.

"ఇలా చాలా కాలం తరువాత మిత్రులు తలవనితలంపుగా కలుసుకోవటంలో నాకెంతో ఆనందం అనిపిస్తుందే మయూరీ" మయూరి ననుసరించి లోనికెళ్తూ అంది. గదిలో రెండు కుర్చీలు దగ్గరగా వేసి యిద్దరూ కూర్చున్నాక, "ఇప్పుడు చెప్పవే. ఎక్కణ్ణించిలా వూడిపడ్డావ్? ఏమిటి కధ?... కనీసం వుత్తరం కూడా రాయకుండా వచ్చేశావ్" అని వరుసగా ప్రశ్నించింది మయూరి. మయూరి మనసు ఆనందంతో పురివిప్పుకుంది. చాలా కాలం తరువాత కలుసుకున్న మిత్రురాల్ని చూస్తుంటే తనకీలోకమే గుర్తులేనంతగా అయింది. "ఆ... వుత్తరం గిత్తరం వ్రాశానే అనుకో. నువ్వు నాకోసం ట్రైన్‌కో, బస్సుకో రావటం, అవి సమయానికి రాకపోవటం, ఆ స్టేషన్‌లోపడి నువ్వేడవటం వీటివల్ల చాలా రోజులుగా వస్తున్న మిత్రురాలు రాకకి ఉత్కంఠత నశించటం, విసుగు చెందటం ఎందుకు చెప్పు? ఇప్పుడు చూడు అకస్మాత్తుగా నేను రావటం, నువ్వు నన్ను చూస్తూ సర్వం మర్చిపోవటం నాకు కాఫీకైనా మిగల్చకుండా ఆ పాడు పిల్లి అక్కడ పాలు తాగేస్తుండటం......ఇవన్నీ ఎంత హాయిగా వున్నాయో చూడు!" అనేసరికి పకపకా నవ్వి, పాలు త్రాగేస్తున్న పిల్లిని చూసి "అబ్బబ్బ. చంపేస్తోంది" అని పిల్లిని తోలి పాలమీద మూతపెట్టి వచ్చి మళ్ళీ కబుర్లకు కూర్చుంది.

"ఆ...ఏమే...అమ్మా, నాన్నా అంతా కులాసాయేనా? అక్కయ్య యిపుడు హాయిగా వుందా? అన్నట్టు రాజు అమెరికా వెళ్ళాడా?" వరుసగా వూపిరి తిరగకుండా ప్రశ్నలు వేసేస్తుంటే, "ఆగు...ఆగు.. ఆగు.... నేను శతావధానిని, అష్టావధానిని కాను. నువ్వు హోటల్ సర్వరులా అలా దండకం వల్లించేస్తుంటే నేనేం జవాబు చెప్పలేను. ఇప్పుడే ఎండలోంచి వచ్చానా? ఎలాగో తెలుసా? పైన నిప్పుల కుంపటిలాటి సూర్యుడు... గాలి స్తంభించిపోయిన ప్రకృతి... చెవ్వులలోంచి అగ్ని జ్వాలలలాటి గాడ్పులు..."

"అబ్బబ్బ... నీ వర్ణన కాస్త ఆపి, సమాధానం చెప్పవే తల్లీ. నీకు పుణ్యముంటుంది."

"ష్...అడ్డురాకు. గొడవ చేయకు...నా కవిత చెడిపోతుంది...సారీ...తెగిపోతుంది..."

"తల్లీ. నీకూ నీ కవిత్వానికీ శతకోటి నమస్కారాలు. ముందు సరిగ్గా మాట్లాడుదూ!" మయూరి ముఖంలో ఉత్కంఠంతో కూడిన చిరాకును చూస్తుంటే మరికొంచెం

(36వ పేజీ చూడండి)

# వారఫలం

మహేష్

30–4–1976 శుక్రవారం మొదలు
6–5–1976 గురువారం వరకు

**మేషం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృషభం :—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**మిధునం :—** ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలో చనలు చేస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకుంటారు.

**కర్కాటకం :—** వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు. సాహసిక వ్యవహారాలు బాగుటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య :—** రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కలుసుకుంటారు.

**తుల :—** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఆందోళ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమయిన మార్పులు వస్తాయి. వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెలుసుకుంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్య చికాకులకు గురికాగలరు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఉద్యోగంలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**ధనుస్సు :—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది

**మకరం :—** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి ఎవరితోనూ వాదప్రతివాదాలు తగవు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. స్త్రీలకు— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**కుంభం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి ముందు ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలు వాయిదాపడతాయి.

**మీనం :—** సంతోషకరమయిన వార్తలను వింటారు. ప్రయాణాలు ఫలించగలవు. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సామాన్యమయినవను లకుకూడా ఎంతో కృషి చేయవలసి వస్తుంది. స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కలుసుకుంటారు

## రాలిన ముత్యాలు

.........శ్రీ సోమసుందర్.........

ఈ సుందర జీవితాన
నారక దుర్వాంఛలేల ?
నందనమున కశనిపాత
దారుణాగ్ని శాపమేల ?

# రెండు విధాల పొదుపు!

క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా
రిఫిల్ ప్యాక్*తో



మీకు 75 పైసలు ఆదా చేస్తుంది



ఎక్కువ కప్పులు
మీకు ఇస్తుంది ప్రతిప్యాక్‌కు ఏ ఇతర ఆహార పానీయములకన్నా




అవును! బోర్న్‌విటా ఇతర ఆహార పానీయముల కన్నా ఎక్కువ పొదుపైనది. ప్రతికప్పుకు 2 చెంచాలు (ఏ ఇతర ఆహార పానీయములలోవలె) వేయండి మరియు మీరు కనుగొనగలరు మీ బోర్న్‌విటా రిఫిల్ ప్యాక్ లేక డబ్బా చాలా ఎక్కువ రోజుల వరకు వస్తుందని. అది ఎక్కువ రుచిగా ఉంటుంది గూడా! వాడి చూడండి మీకు మీరే గమనించండి.

ముఖ్య విషయం

ఈ రిఫిల్ ప్యాక్ బోర్న్‌విటా యొక్క ఫ్యాక్టరీ తాజాదనం పూర్తిగా నిలచునట్లు ప్రత్యేకంగా సీలు చేయబడింది. ఈ ప్యాక్‌ను తెరువగానే దయచేసి పదార్థమును దాని తాజాదనము నిలుపుకొనుటకు తక్షణమే ఒక బోర్న్‌విటా డబ్బాలోనికి పోసిపెట్టండి

* హెర్మెటికల్లీ సీల్డ్ కంటెయినర్ కార్టన్స్

## క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

ప్రతి ప్యాక్‌కు అధికమైన కప్పులు,
ప్రతి కప్పులో అధికమైన రుచి!

శక్తి ఉత్సాహం మరియు రుచికోసం ఆదర్శమైన ఆహార పానీయం

OBM-5911 TL

# ఫాలాక్షుని డైరీ

## వెర్రి అభిమానం

ప్రపంచంలో ఏ సినిమానటికి కూడా లేనంత జనాభిమానం కిరిన్‌ఎవరెస్ట్ అనే ఆమెకున్నదట. ఆమె టెన్నిసుఛాంపియనట. ఆమెవేసుకున్న షూ, సాక్స్, షూలేస్, బట్టలు, లోపలి బట్టలు వగైరా అన్నీ కూడ ఆమె అభిమానులు వేలంవెర్రిగా కొనుక్కుని దాచుకుంటున్నారట.

## వేలం వెర్రి !

ఒకప్పటి అమెరికా ప్రెసిడెంటు కెనడీని యిష్టారాజ్యంగా తిడుతూ, విమర్శిస్తూ ఎవరో ఒకాయన ప్రెసిడెంట్ ఐసన్‌హోవరుకు రాసిన ఉత్తరం ఒకటి అమెరికాలో వేలం వేస్తే ఎవరో కుబేర్రావ్ మూడువేలయిదొందల డాలర్లకు కొనుక్కుని చక్కా పోయాట్ట దటీజ్ వేలంవెర్రి !

## రష్యన్‌లో రామాయణం సినిమా

మాస్కోలో పిల్లలకోసం ఏర్పాటు చేసిన వో నాటక రంగంలో యిప్పటికి సుమారు పదిహేనేళ్ళుగా రామాయణం నాటకం వేస్తున్నారట. ఇప్పుడు వారు యిహ ఆ రామాయణాన్ని సినిమా తియ్యాలని నిశ్చయించు కున్నారట. శ్రీరాముడు రష్యనుభాషలో మాట్లాడితే యిండియా చెవులకు ఎటులుండును? ఏస్క్రీస్తు తెలుగుమాట్లాట్టంలా మన సిన్మాల్లో.

## ఇంజన్‌తోసహా ప్లాస్టిక్ కార్లు !

అమెరికాలో యిప్పుడు సాంతం కేవలం ప్లాస్టిక్‌తో చేసిన కారులు వచ్చేశాయట. ఇంజనుతో సహా.. ........యస్సార్ !

## బీరు — సంగీతం !

కోపెన్‌హాగన్ విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ హాల్బ్‌హాన్‌సెన్ అనే ఆయన బీరు స్వతహాగా యిచ్చే ఆనందంకన్నా, పరిసర పితిగతులవల్ల యిచ్చే ఆనందంతో ఆ ఆనందం మరింతవుతుందని కనిపెట్టాడట. అంటే బీరు త్రాగుతున్నప్పుడు శ్రవణానందకరమైన వాద్యసంగీతం నేపథ్యంలో ఉంటే అదే బీరు మరింత ఉత్తేజాన్నీ, ఉల్లాసాన్నీ, ఆనందాన్నీ యిస్తుందని కనిపెట్టారట. ఘాటైన బీరుకు ఘాటైన వాద్యాలు, ఘాటు తక్కువ సాదా బీరుకు మెత్తని వాద్యసంగీతం తోడుండాలని అన్నారట.

## కాటికెళ్లిన కారుకైనా తప్పని వర్ణవిచక్షణ !

దక్షిణ ఆఫ్రికా లేడిబ్రాండ్‌కు చెందిన మార్గరెట్‌గ్రిఫిత్స్ అనే ఆవిడకు తన కారంటే వల్లమాలిన ప్రేమట. తాను చనిపోతే తనని ఆ కారుతోపాటు ఖననం చేయాలని వీలునామాలో వ్రాసిందట. తీరా ఆవిడ అంత పనీచేశాక, స్మశాన సంబంధ అధికారులు కారుని పాతెయ్యడానికి సుతారామూ ఒప్పనన్నారట. వాట్ఫర్ అని అడిగితే ‘‘ఈ వాటిక తెల్లవారికి మాత్రమే, కానీ, ఆ కారు నీలం రంగుది కనుక’’ అన్నారట. వార్నీ!

## భారత ఫొటోగ్రాఫర్‌కి ప్రథమ బహుమతి

ఆంస్టర్‌డాంలోని ఫోటోగ్రఫీ పోటీలో యీ ఏడు మన దేశానికి చెందిన పార్థలోమియో అనే ఆయనకు ప్రథమబహుమతి వచ్చిందట. లాగి తూగే ఒక వ్యక్తి దశను యీయన ఎనిమిది ఫోటోలలో అద్భుతంగా చూపించారట.

ఇండియాకు చెందిన వ్యాపారస్థులేగాక జనులు కూడా మా దేశాన్ని వదలి వెళ్ళిపోవాలి అని శాసనాం చేసిన ఉగాండా జనాధిపతి ఇడిఅమెనిన్‌కు ప్రస్తుతం పెర్సనల్ డాక్టరుగా వుంటున్నాయన భారతీయుడట! వారెవ్వా!

## సెలవుకోసం !

కెనడాదేశంలో వో ఫ్యాక్టరీలో పనిచేసే చాణక్యుడు తనకు శలవు కావాలనుకున్నప్పుడల్లా తన సెలవులు వృదాఅవకుండా శలవు పొందే మార్గం వొకటి కనిపెట్టాడట ఆ ప్రకారం తనకు సెలవు కావాల్సిన రోజున పోలీసులకు ఫోనుచేసే, తను పనిచేస్తున్న ఫ్యాక్టరీలో ఎవరో బాంబుపెట్టారని చెప్పేవాడట దాంతో పోలీసులు రయమున ఆ ఫ్యాక్టరీకి వెళ్ళి పనివారికి శలవు ప్రకటించి పంపి బాంబుకోసం వెతుకుళ్ళాట ప్రారంభించేవారట. ఈ ప్రకారంగా ఆరుసార్లు చేసి, ఏడోసారి, దాగుడు మూతలో దొరికిపోయాట్టతను. యిట్‌హిజ్ బ్రెయినీజ్....

## అమెరికా విమానబలంలో స్త్రీలు

అమెరికా యుద్ధవిమాన విభాగంలో యిప్పుడిప్పుడే స్త్రీ అధికారులను ఎన్నికచేసి వేసుకుంటున్నారట. ఏప్టే యిన్నాళ్ళు లేదా!

---

## కొత్త - పాత లు

‘కొత్త వింత, పాత రోత’ అనే మాట ఇప్పటిది కాదు. అది యదార్థం కూడాను. కొత్తపద్ధతి వచ్చిందంటే దానిపై మోజు, పాతపద్ధతిపయి ఏవగింపు కలగడం పరిపాటి. ఆ విధంగానే ప్రాచీన సంప్రదాయం ఆచరించేవారు కొత్తపద్ధతిని నిరసిస్తారు. నూతన పద్ధతివారికి పాత పద్ధతి కిట్టదు.

కాని కాలాన్నిబట్టి పద్ధతుల మంచిచెడ్డలను నిర్ణయించడం మాత్రం పరికాదు. ప్రాచీన పద్ధతిలో ఈ కాలానుగుణముగా విడువదగినవీ, నవీన పద్ధతినుండి గ్రహింపదగినవీ ఉంటున్నవి. కచ్చితంగా ప్రాచీన పద్ధతినే అనుసరిస్తున్న విజ్ఞులలో కూడా నవీన పద్ధతులను కొన్నిటిని ఆమోదించేవారు లేకపోలేదు అట్టివారిలో జగద్గురువులు కంచి కామకోటి పీఠాధీశ్వరులు విశ్వమానవ సౌభ్రాత్ర, సౌఖ్యాలను అభిలషించే శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు ముఖ్యులు.

## ధర్మపథం

నేటి యువసమాజం అర్థం లేకుండా పాశ్చాత్యానుకరణ చేస్తున్నదనీ, దేశంలోని పరిస్థితులతోగాని, దేశం బయటి పరిస్థితులతో గాని జోక్యం కలుగజేసుకోలేదనీ, ఆధునిక విజ్ఞానంవల్ల ప్రాచీనసంస్కృతి దెబ్బతింటుందనీ ఒకరు తమ అభిప్రాయాన్ని చెప్పారు. దానికి శ్రీస్వామివారు ‘స్వధర్మాన్ని విడిచినవారు పరధర్మాన్ని గురించి భయపడతారనీ, ఆధునిక ప్రపంచంలోని మంచికి ప్రాచీన సంస్కృతి వ్యతిరేకం కాదనీ, తెలియజేశారు. మంచి ఎందులో ఉన్నా దానిని గ్రహించాలనీ, ప్రాచీనమైనంత మాత్రాన ప్రతీ పాతదాన్నీ గ్రహించ నక్కరలేదనీ ‘‘పురాణమిత్యేవ న సాధు సర్వం’ అనీ తెలిపారు. ప్రాచీనతతోపాటు ఉత్తమమైన నవీనత్వాన్ని కూడా స్వీకరించడం ధర్మం అన్నారు. ‘‘ప్రతి యువకుడూ ఈ రెండింటినీ సమన్వయాన్ని సాధించాలి. భారతీయ సంస్కృతిని రక్షించడం మా సంకల్పం. అయినా ఆధునిక ప్రజాజీవనాన్నీ, ప్రజల ఆదర్శాలనూ, వారి కోరికలనూ కూడా గౌరవించి సమ్మతించవలసినదే! అందువల్ల నవీనతను కూడా స్వీకరించాలి. సనాతన ధర్మంతో యుగధర్మం కూడా కలిసి ఉంటుంది. ఒకప్పుడు పాశ్చాత్యాచారం వృద్ధిపొందితే మరొకప్పుడు వైదికాచారం ప్రవృద్ధమౌతుంది. ఇది కాలం యొక్క ప్రభావం. అందువల్ల మనం ఆందోళ పడనక్కర్లేదు.’’ అని వారి అభిప్రాయం

ప్రాచీన సంస్కృతిని రక్షించాలంటే— ముందుగా సమాజ సముద్ధరణ అవసరమే. అయినా పెద్దలు దానికి తగిన మార్గాన్ని చూపులారు. ఆ మార్గాన్ని అనుసరించినట్లయితే సముద్ధరణ దానంతట అదే జరుగుతుంది

—బులుసు వేంకటరమణయ్య

# కొలిమిజ్చిన తీర్పు 'అన్నయ్య'

(గత సంచిక తరువాయి)

''అయినా రోజూ తప్పత్రాగట మేమిటి ? పుస్తకాల షాపుమీద నష్టం రావటం ఏమిటి ?'' వ్యాఖ్యానించింది సుందరి

ఈ హడావిడికి సుజాత, సుమ, సుధ అందరూ లేచి సారాంశం ఏమిటో గ్రహించారు

వరండా గదిలో విశ్వం, ''ఆ దుర్మార్గుడు ఎంతకైనా తెగించగలడు సుమ ఇప్పటికైనా అతడితో అనుబంధాన్ని త్రుంచివేసుకోంటే బాగుండు'' అని అనుకున్నాడు.

* * *

మర్నాడు ఉదయం ఆఫీసుకు వెళ్ళేటప్పుడు సుబ్బరామయ్య జీపులో రమేష్ పుస్తకాల షాపుకు వెళ్ళాడు. అక్కడికి ఎంత ఆవేశపడి వెళ్ళాడో ఆ మూసివున్న బుక్ స్టాల్‌ను చూసి అంత చప్పబడిపోయాడు అతడు.

**జరిగిన కథ 6:** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు. సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసన్ చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కలత చెందుతాడు సుబ్బరామయ్య తన అల్లుడికి వుద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాథం సుబ్బరామయ్యని కోర్తాడు సుబ్బరామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు. రమేష్ వ్యాపారానికి కావలసిన అప్పిప్పించటానికి అంగీకరిస్తాడు సుబ్బరామయ్య ఆ యింట్లో రామనాథంచే వదలబడ్డ అనాథ విశ్వం, తన మాట నేర్పుతో అందరికి చేరువ అవుతాడు అందాలరాశి సుమను వలలో వేసుకోడానికే విశ్వం నాటక మాడుతున్నాడని సుధాకర్‌కు నూరిపోస్తాడు రమేష్ విశ్వాన్ని శంకిస్తారు సుందరి, సుబ్బరామయ్యలు సుజాతను విశ్వంతో సినిమాకు పంపుతాడు సుబ్బరామయ్య రమేష్‌తో తిరుగుతున్న సుధ కూడా చెడిపోకుండా చూడమని విశ్వాన్ని కోరుతుంది సీతమ్మ విశ్వం తన ప్రేమను తిరస్కరించాడన్న కసితో రమేష్‌తో తిరుగుతూంటుంది సుమ సుజాతనే చేసుకుంటానని విశ్వం రూఢిగా చెప్పగానే రామనాధాన్ని పిలిపించి ముహూర్తం పెట్టిస్తాడు సుబ్బరామయ్య

## 17

''అన్నయ్యా! అన్నయ్యా! ..'' ఎంతో ఖంగారుగా వినిపించింది సీతమ్మ కంఠం

అది అర్ధరాత్రి సమయం.

ఆందోళనగా లేచివెళ్ళి తలుపు తీశాడు సుబ్బరామయ్య ఆ వెనక సుందరీ లేచి వచ్చింది.

తలుపు తీసి తన చెల్లెలి అవస్థను చూసి కొయ్యబారిపోయాడు సుబ్బరామయ్య

సీతమ్మ తలకు కట్టు కట్టి ఉంది. ఆమె కట్టుకున్న తెల్ల బట్టమీద నెత్తురు మరకలు!

''ఏమయింది సీతా, ఏమయింది ?''— సుందరి ఆదుర్దాగా వెళ్ళి మరదల్ని దగ్గరికి తీసుకొంది.

సీతమ్మకు దుఃఖం ఆగలేదు. గావురుమంది. చెల్లెలి కళ్ళనీళ్ళు చూశాక సుబ్బరామయ్య మనసూ ఆర్ద్రమయింది కళ్ళు తడిశాయి.

''ఎందుకు జరిగిందమ్మా ఇలా ?'' — అనడిగాడు. అతని కంఠం పూడుకుపోయింది అప్పుడు.

''కన్నకొడుకు నా కిచ్చిన బహుమానం అన్నయ్యా'' అని మళ్ళీ ఒకసారి ఘొల్లుమంది సీతమ్మ

''రమేష్ ఇంత పని చేశాడా !'' — ఆశ్చర్యం వ్యక్తం చేసింది సుందరి

''ఇంతకి దిగజారాడా వాడు!'' — సుబ్బరామయ్య అన్నాడు

''అయ్యో, ఎంత పని జరిగింది ?.. రా సీతా, లోపల కూర్చొని మాట్లాడుకుందాం '' అని సుందరి సీతను పట్టుకొని లోపలికి తీసుకువచ్చింది సుబ్బరామయ్యా వాళ్ళను అనుసరించాడు

విశ్రాంతిగా కూర్చున్నాక,

''అసలిదంతా ఎందుకు జరిగిందమ్మా ?'' — సానునయంగ అడిగాడు సుబ్బరామయ్య

''ఏమని చెప్పమంటావ్ అన్నయ్యా, ఇదంతా నా ఖర్మ రమేష్ నా కన్నకొడుకు కాదు — గర్భశత్రువన్నయ్యా! వాడిలో మార్పు అనేది నేను బ్రతికుండగా రాదని తేలిపోయింది . ఈ మధ్య వాడు రోజూ త్రాగి ఇంటికి వస్తున్నాడు . ఆ అలవాట్లకు ఎక్కడి డబ్బు చాలటంలేదు పైగా ఆ పుస్తకాల వ్యాపారంలో నష్టం వస్తోంది ఆ నష్టం పూడ్చటానికి కొంత డబ్బు కావాలి అంటున్నాడు కొన్ని రోజులుగా ''నా దగ్గర డబ్బు లేదు ఇవ్వను'' అని నిష్కర్షగా చెప్పేశాను ''డబ్బు లేకపోతే ఇల్లు అమ్మేస్తాను'' అన్నాడు ఉన్న ఆ ఇల్లు అమ్మేస్తే వచ్చే వంద రూపాయల అద్దె డబ్బుకూడా రాదు వద్దు అన్నాను ఏదేమైనా ముందు నా అవసరం తీరాలని పట్టుబట్టాడు నేను ససేమిరా వీలులేదన్నాను దాంతో — ఆ త్రాగిన మత్తులో కర్ర తీసుకొని కొట్టాడు మా ఇంటి వెనక వాటాలో అద్దెకుండేవాళ్ళు వచ్చి నా తలకు కట్టు కట్టి వాళ్ళింట్లోకి తీసుకువెళ్ళారు తర్వాత నా కిక్కడికి రావాలనిపించింది వాళ్ళబ్బాయే నన్ను ఇక్కడిదాకా పంపివెళ్ళాడు '' జరిగిందేమిటో చెప్పింది, సీతమ్మ

''ఎంత పని చేశాడు ? ఉండు సీతా, నేను రేపు వాణ్ణి కనుక్కుంటాను .'' అన్నాడు సుబ్బరామయ్య

అయినా అంతటితో ఊరుకోక వాళ్ళ యింటి దగ్గరికి వచ్చాడు అక్కడా లేడు రమేష్! అద్దెకు వుండేవాళ్ళను అడిగితే 'మాకు తెలియదండి' అన్నారు ఇక చేసేదీలేక అలాగే ఆఫీసుకు వెళ్ళాడు

ఆఫీసుకు వెళ్ళాక ఒక కొత్త సంగతి తెలిసింది సుబ్బరామయ్యకు మూడురోజుల్లో తమ డైరెక్టరు ఆ ఊరు రాబోతున్నాడు తమ కార్యాలయాన్ని విజిట్ చేయబోతున్నాడు ! ఆ 'టూర్ ప్రోగ్రామ్' కాగితం చూసి కొంచెం త్రుళ్ళిపడ్డాడు అతడు

'మరీ ఇంత తొందరలోనా ! ?' అనుకున్నాడు అయినా తప్పదుకనుక తను హడావిడిచేసి గుమాస్తాలని తొందరపెట్టసాగాడు ఆఫీసు వర్కు ఏదీ పెండింగ్‌లో పడి వుండకూడదని

మధ్యాహ్నం యింటికి వచ్చాక,

''రమేష్ నాకు కనిపించలేదు సీతా ! ఎక్కడికి వెళ్ళాడో ఏమో మరి !'' అన్నాడు సుబ్బరామయ్య

''వాడికి యీ ఊళ్ళో కావలసినంతమంది బంధువులు . . ఎవరింటికి వెళ్ళాడోలే అన్నయ్యా!'' అంది సీతమ్మ కొడుకు జాడ గురించి ఆమెకు మాత్రం దిగులులేదు

''అంటే ?'' పైకి తొందరపడి అలా అడిగేశాడెకానీ, లోలోపల అతడికి చెల్లెలి మాటలు కొంచెం కొంచెం అర్ధమవుతూనే వున్నాయి

''వాడు ఒక్క త్రాగుబోతే కాదన్నయ్యా! తిరుగుబోతుకూడా !'' దాచుకోకుండా చెప్పేసింది సీతమ్మ

''మరి వాణ్ణి గురించి తెలిసీ — యింతకాలం ఎందుకు వుపేక్షించావ్ సీతా ?''

''ఉపేక్షించక నేను చేసేదేముందన్నయ్యా ? పూవు పుట్టగానే పరిమళిస్తుందని వాడిలో అవలక్షణాలు చదువుకొనే రోజుల్లోనే బయలుదేరాయి. ఏదో చిన్నతనం అని అప్పుడు సరిపెట్టుకున్నా — యిపుడు సహించలేకుండా వున్నాను ఇకనైనా మారతాడేమో మారతాడేమో అనే యింతకాలం గుప్పెటమూసి వుంచాను కానీ లాభంలేదన్నయ్యా!''

''సరే సీతా! నాకు మరి నాలుగురోజుల వరకు తీరుబడి వుండదు ఆ తర్వాత రమేష్‌తో నే మాట్లాడతాను అందాకా నువ్వు యిక్కడే వుండు ''

''అలాగే అన్నయ్యా! అయితే నేనొక పొరపాటు చేశాను నన్ను క్షమిస్తావా ?''

సీత తప్పుచేయుటమా ! ? నమ్మలేదు సుబ్బరామయ్య అయినా యేమిటో తెలుసుకోవాలని అడిగాడు

''ఏమిటమ్మా, అది ?''

''సుధ రమేష్‌తో స్నేహం చేస్తున్నాడు ''

ఈ విషయం సుజాత తనకు లోగడే చెప్పింది కానీ, దాని మాటను లెక్కలోకి తీసుకోలేదు తను అయినా ఆ తుచ్ఛుడితో వీడికి స్నేహమేమిటి ? కూడదని గట్టిగా హెచ్చరించాలి వాణ్ణి — అనుకున్నాడు

''సుమ విషయంలో కూడా నీవు జాగ్రత్త పడాలన్నయ్యా! యేదోవిధాన దాన్ని చేసుకుతీరాలని రమేష్ మొదట్నుంచీ అంటూనేవున్నాడు ఇంట్లో కానీ ఆ నీచుణ్ణి చేసుకొని — ఏవిధంగానూ సుఖ

పడదు సుమ నాకు తెలుసు. అందుకే దాన్ని రమేష్‌తో కలిసి తిరగవద్దను."

"అది రమేష్‌తో కలిసి తిరుగుతోందా ?"

"అవునన్నయ్యా. సుమ ఈ మధ్య తరచు మా ఇంటికి వస్తోంది రమేష్‌తో సినిమాలకు, షికార్లకు వెళ్తోంది..."

ఇది సహించరాని పరిణామంగా తోచింది సుబ్బరామయ్యకు అలా జరగటానికి వీల్లేదు అని గట్టిగా చెప్పింది అతడి అంతరాత్మ తగు జాగ్రత్త తీసుకోవాలనుకున్నాడు అతడు

"సరే" అని — టైమ్ చూసుకొని త్వరపడి ఆఫీసుకు వెళ్ళాడు సుబ్బరామయ్య అప్పటికి

## 18

సుబ్బరామయ్యకు తల చిక్కు తీసినట్లైంది వాళ్ళపై అధికారి తన విజిటింగ్ పూర్తి చేసుకొని సంతృప్తితో వెళ్ళిపోవటంతో

ఆ నాల్రోజులూ అతడు ఇంటి విషయాలే పట్టించుకోలేదంటే సరిపోతుంది పొద్దున్నే ఆఫీసుకు వెళ్ళటం — రాత్రి ఏ పదింటికో ఇంటికి రావటం జరిగింది మధ్యాహ్నం భోజనానికి రావటానికి వీలుపడకపోతే బంట్రోతుచేత క్యారేజీ తెప్పించుకు తిన్నాడు మొత్తానికి తన ఆఫీసు వర్కును అప్టుడేట్ చేయించాడు రిమార్కులకు తావు లేకుండా

ఆఫీసులో అంత తీరుబడి లేని పనిలో ఉన్నా సుబ్బరామయ్య మెదడు ఒక ప్రక్క రమేష్ సుమల మీద పనిచేస్తూనే ఉంది

రమేష్‌కు ఏ విధంగా బుద్ధి తెప్పించాలి ? ఉతడితో చనువు కూడదని సుమకు, స్నేహం వద్దని సుధకు ఏ విధంగా నచ్చచెప్పాలి ?

ముఖ్యంగా సుమ — కన్నతల్లినే కనికరం లేకుండా కొట్టిన ఆ దుర్మార్గుడు దాన్ని ఏం చేస్తాడో ? . ఈ విషయంలో ముందు రమేష్‌ను హెచ్చరించాలి తర్వాత సుమకు ఏదో విధంగా నచ్చ చెప్పొచ్చు

తన ఇంటివైపు వస్తున్న జీపును మరో దిక్కుకు తిప్పమన్నాడు డ్రైవర్‌తో ఒక డాబా ఇంటి ముందు ఆపమని దిగాడు సుబ్బరామయ్య

అప్పుడూ ఆ ఇంటి తలుపులు వేసే ఉన్నాయ్ అయితే తాళంపెట్టి లేదు అంటే — రమేష్ ఇంట్లోనే ఉన్నాడన్నమాట ! — ఆ సంగతి తెలిశాక ఆవేశంగా వరండా మెట్లెక్కి అక్కడే ఆగిపోయాడు

లోపలినుంచీ మాటలు —

"నన్ను వదులు బావా, నేను వెళ్ళాలి" — అయిష్టంగా అంటోంది ఒక యువతి—ఆమె సుమే

"నిన్ను ఇప్పుడు కాదు ఎప్పుడూ వదలను. జీవితాంతం నువ్వు నాతోనే ఉండాలి" అంటున్నాడు రమేష్

"ఆ మాట తర్వాత ముందు నన్ను వదులు" — సుమ కంఠంలో మార్పు వస్తోంది

"ఇంత కాలానికి ఒంటరిగా — అవకాశం చిక్కాక నిన్నెలా వదులుతాను, పిచ్చి సుమా !"

"అంటే ?"

"నిన్ను మామూలుగా అయితే మీ నాన్న నా కిచ్చి చేయడు నువ్వూ నన్ను చేసుకుంటావన్న నమ్మకం లేదు. అందుకే ఎవరూ వేరు చేయలేని అనుబంధం — మనిద్దరి మధ్య ఏర్పడాలి... అప్పడే నా ఆత్మకు శాంతి."

"పిచ్చి పిచ్చి ఆలోచనలకు పోకు.. మర్యాద దక్కదు నీకు."

"నా మర్యాదను ఎలా కాపాడుకోవాలో నాకు తెలుసులే . రా..."

— ఇక తను ఉపేక్షించి లాభంలేదని తలుపుల మీద బడబడ బాదాడు సుబ్బరామయ్య, "రమేష్... రమేష్.. " అంటూ.



# కాలమిచ్చిన తీర్పు

తలుపుతీసి తండ్రిముందు సిగ్గుగా తల వంచుకొంది సుమ.

లోపల కొయ్యబారిపోయినిలబడివున్నాడు రమేష్.

అదొక యాదృచ్ఛిక సంఘటన. మహత్య మేమిటోగాని కొద్దిసేపటి వరకు ఎవరి నోటివెంట మాట పెగిలిరాలేదు

చివరకు సుబ్బరామయ్య అన్నాడు, "సుమా! వెళ్లి జీపెక్కు" అని

తుచ్ఛుడు రమేష్ పూర్తిగా రుజువై పోయిందిప్పుడు. అటువంటివాడితో యిక మాట్లాడటమే మహాపాపంగా తోచిందతడికి

'వాడికేం చెప్పీ లాభంలేదు. వినడు. ఆ స్థితిలో లేడు ఆ చెప్పవలసిందేదో సుమకే చెబితే సరిపోతుంది. దానికీ యీ సంఘటనతో అంతా తెలిసివచ్చి వుంటుంది. ఇక రమేష్‌తో ససేమిరా తిరగదు అది ఇదీ ఒకందుకు మంచిదేలే' అని పించింది.

సుమ వెళ్లి జీపెక్కింది. తర్వాత ఒకసారి రమేష్‌వైపు అదోమాదిరి చూసి తనూ వచ్చి కూతురి ప్రక్కనే కూర్చున్నాడు సుబ్బరామయ్య

ఇంటికి వచ్చాక అతడు ఎవరితోనూ మాట్లాడ లేదు త్వర త్వరగా తన పనులు కానిచ్చుకొని డాబా మీదికి వెళ్లి కూర్చున్నాడు.

మళ్లీ ఎండాకాలం వచ్చిందిమరి

సుబ్బరామయ్య వెనకే సుమకూడా వచ్చిం దక్కడికి పైకి ఆమెను రమ్మని తనే చెప్పాడు.

వాళ్లు డాబామీదికి వెళ్లిన కొద్దిసేపటికే సుజాత కాఫీ టిఫిన్‌లు సిద్ధం చేసుకొని పైకి తీసుకువెళ్లాలని బయలుదేరింది.

నాలుగు మెట్లెక్కేసరికి ఆమెకు పైనుంచి మాటలు వినిపించసాగాయి తండ్రి కంఠంలో తీవ్రతను కనిపెట్టి అక్కడే ఆగిపోయింది సుజాత

"వాడి సంగతి మొదట్నుంచీ మనందరికీ తెలిసిందే తెలిసీ నువ్వు మూర్ఖంగా ప్రవర్తిస్తావా? అదృష్టవశాత్తు సమయానికి నేనక్కడికి రాబట్టి సరిపోయింది లేకపోతే ఏమయ్యేదానివి? నీ జీవితమే సర్వనాశనం అయ్యేది అయినా, అత్తయ్య యిక్కడే వుందికదా? అటువంటప్పుడు నువ్వసలు అక్కడికి ఎందుకు వెళ్లావ్?"

"నా విషయంలో ఇంత తెగిస్తాడనుకోలేదు"

"అనుకోకపోవటమేమిటి? నిప్పు ముట్టు కుంటే కాలుతుందని తెలియదా? ఊబిలో దిగబడితే కూరుకుపోతామని తెలియదా? రమేష్ ఎటువంటి వాడో, వాడి తత్వమేమిటో అంత తెలియకుండా వుందా నీకు? సుమా! చివరిసారిగా చెబుతున్నాను చదువు పూర్తయ్యేవరకు నువ్వు యితర విషయాలు గురించి ఆలోచించకు నీ భవిష్యత్తును తీర్చిదిద్ద టానికి పెద్దలం మేం వున్నాం అన్న సంగతి గుర్తుంచుకో"

అలా పైకి కరకుగా మాట్లాడినా సుబ్బ రామయ్య అంతరాత్మలో ఏదో భావన కలుగక మానలేదు

"సుమ మాత్రం చిన్నపిల్లా? దానికీ పంతొమ్మిదవయేడు వచ్చింది. వ్యక్తిత్వాన్ని సంతరింపజేసుకొనే వయసు. వయసునుబట్టి దానిలోను ఆశలు, ఆకాంక్షలు జనించటం సహజం మరి."

వాళ్లిద్దరి మాటలూ విన్న సుజాత అసలు సంగతేమిటో తేలిగ్గానే గ్రహించుకొంది.

'సుమకు తెలుసు రమేష్ బావ యెటువంటి వాడైందీ. అత్తయ్య తలకు గాయంతో యీ యింటికి రావటం అదీ చూసింది చూసీ, అంతా తెలిసీ — అది కావాలనే చేస్తోంది యింతా. ఆ నీతి, నియమాలులేని రమేష్ చేతుల్లో ఎప్పుడో ఒకప్పుడు దాని జీవితం బలైపోతుంది కానీ, అలా జరగ టానికి వీల్లేదు.' అంతరాత్మ ఘోషపెడుతూం డగా — తప్పదన్నట్లే పైకి వెళ్లింది సుజాత.

పెద్దకూతుర్ని చూశాక "ఇక నువ్వు వెళ్లు" అన్నాడు సుమతో, సుబ్బరామయ్య

ఆమె వెళ్లింది. మాటలు లేకుండానే సుజాత పెట్టిన టిఫిన్ తిని కాఫీ త్రాగాడు.

సుజాత తండ్రితో ఏమో — మాట్లాడాలను కొంది కానీ — ఆమె గొంతు పెగిలిరాలేదు.

అంతలోనే అక్కడికి సీతమ్మ వచ్చింది, తన కొడుకు విషయం యేమయినా తెలిసిందేమో అన్నయ్యను అడుగుదామని.

## 19

అర్ధరాత్రి ఉన్నట్లుండి "అమ్మా" అని పెద్దగా మూలిగింది సుందరి.




ప్రక్కనే పడుకొనివున్న సుబ్బరామయ్య ఉలిక్కిపడి లేచి "ఏమయింది సుందరీ, ఏమయింది?" అని కంగారుగా అడిగాడు

"గుండె నెప్పిగా వుందండీ" బాధతో విలవిల్లాడుతూ సమాధానం చెప్పింది సుందరి

భార్య ఆ మాట అనేసరికి వెంటనే ఏం చేయటానికీ పాలుపోలేదు అతడికి

అప్పటికప్పుడు డాక్టర్ని పిలవటానికి ఇంట్లో ఫోను లేదు ప్రక్కింటివాళ్లకు వున్నా వెళ్లటానికి అది సమయంకాదాయెమరి జీపువున్నా డ్రైవర్‌లేడు

"బాగా వుందా నెప్పి?" సుబ్బరామయ్య స్వరంలో జీవం లేదప్పుడు

"ఊఁ" అంది సుందరి

తనకేమీ తోచక ఆరుబయట పడుకున్న సీతమ్మను లేపాడు

సుందరి, సుబ్బరామయ్య వరండాలో పడు కున్నారు మిగతావాళ్లు ఆరుబయటే పడు కున్నారు.

పరిస్థితి తెలుసుకొని, "ఏం చేద్దామంటా వన్నయ్యా?" ఆమె అయోమయంగానే అంది

"వెళ్లి డాక్టర్ని తీసుకురావాలంటే ఆలస్య మవుతుంది మనమే రిక్షాలో సుందరిని అక్కడికి తీసుకువెళ్తే?"

"అలాగే చేద్దామన్నయ్యా."

వాళ్ల మాటలు విని సారాంశం తెలుసుకున్న విశ్వం లేచి పరుగున వెళ్లి రెండు రిక్షాలను తీసుకు వచ్చాడు

అప్పటికి సుజాత, సుమ, సుధ అందరూ లేచారు

కాసేపట్లోనే సుందరిని తమ ఫ్యామిలీ డాక్టర్ ఆనంద్ దగ్గరికి తీసుకువెళ్లారు

ఆమె వెంట సీత, సుబ్బరామయ్య, సుధ వెళ్లారు సుజాత, సుమలను ఇంట్లోనే ఉండమని— విశ్వానికి జాగ్రత్త చెప్పారు.

డాక్టర్ ఆనంద్ యిల్లు — రెండతస్తులమేడ. క్రింది వాటా డిస్పెన్సరీ, పైభాగం నివాసానికి కేటాయించాడు అతడు

సమయానికి ఆ డాక్టరు ఇంటిదగ్గరే ఉన్నాడు. సుందరిని పరీక్షించి అవసరమైన యింజక్షనులు, మందులు యిచ్చాడు. తాత్కాలికంగా బాధ ఉపశమించినా ఆమె కొన్నిరోజులు తన హాస్పిటల్లోనే ఇన్ — పేషెంట్‌గా వుంచటం మంచిదని సలహా యిచ్చి, అవసరంకూడా అని సిఫార్సు చేశాడు.

"అలాగే డాక్టర్! అయితే ఆమెను త్వరగా కోలుకొనేట్లు చేయాలి ఎందుకంటే మా పెద్దమ్మాయి పెళ్లి దగ్గరపడింది. ముహూర్తానికి మరో పదిరోజులే వ్యవధి వుంది" అన్నాడు సుబ్బ రామయ్య

"అన్ని రోజుల వరకు అక్కరలేదు. మరో రెండు రోజులు — ఆమె పరిస్థితి సంతృప్తికరంగా తోచిన వెంటనె డిస్చార్జి చేసేస్తాను. ఇందును గురించి ఎవరూ పెద్దగా ఖంగారు చెందవలసిన అవసరం లేదు" అంటూ పూర్తి భరోసా ఇచ్చాడు డాక్టర్ ఆనంద్.

ఆ రాత్రల్లా సుందరితోపాటు అక్కడే ఉండి పోయారు సీత, సుబ్బరామయ్య కూడా సుధ వెంటనే ఇంటికి తిరిగి వచ్చేశాడు

తమ్ముడు చెప్పిన మాటలనుబట్టి తల్లి ఆరో గ్యాన్ని గురించి అంతగా దిగులనిపించలేదు సుజాత, సుమలకు 'సుందరికి ఎప్పుడూ ఏదో సుస్తీ చేయటం — తగ్గటం' ఇది వాళ్ళ అనుభవ విషయమే నాయె

* * *

ఆ మర్నాటి మధ్యాహ్నం మాట —

సీతమ్మ హాస్పిటల్లోనే ఉంది సుందరిని కనిపెట్టుకొని ప్రొద్దున ఒకసారి వెళ్లివచ్చాడు సుబ్బరామయ్య అయినా ఇంట్లో ఏమీ తోచనట్లు మళ్లీ మధ్యాహ్నం కాఫీ త్రాగాక భార్యను చూద్దామని వెళ్లాడు తండ్రి వెనకే సుధ పాలఫ్లాస్కు తీసుకు బయలుదేరాడు

సుమ గదిలో పడుకొని ఉంది నిద్రపోతోందో ఏమో తెలియదు

ఇదే అదను అనుకొని సుజాత విశ్వం గదిలోకి వచ్చింది.

అతడితో వంటరిగా మాట్లాడాలని కొన్ని

రోజులుగా అనుకొంటూనే ఉంది కానీ, అవకాశం కలగలేదు ఇంట్లో అత్తయ్య కూడా ఉంది — తాము మాట్లాడుకొనే మాటలు ఎవరు వింటారో, పరిస్థితి ఎలా మారుతుందోననే సందేహిస్తోంది .. ఇపుడు అనుకోని సంఘటనగా — అవకాశం ఏర్పడింది దీన్ని సద్వినియోగం చేసుకోవాలి...విశ్వానికి తన మనసు విప్పి చెప్పెయ్యాలి తనేమైపోయినా సుమ జీవితం బాగుపడాలి

"ఏమిటి సుజాతా, నాతో ఏమైనా పనా?"— టేబిల్ ముందు కూర్చొని ఏదో పుస్తకం చదువుకొంటున్న విశ్వం అడిగాడు

గొంతు పెగలక అవునన్నట్లు తల ఊపింది

"ఏమిటి చెప్పు" సావకాశంగా అడిగాడు

తన మనసులో ఉన్న భావాలను ఎలా బయట పెట్టాలో తెలియని సుజాత కన్నీటి పర్యంతమైంది

"భయపడతావేం? చెప్పు సుజాతా" బామాలుతూ అడిగాడు

"మిమ్మల్ని నేను పెళ్లి చేసుకోలేను విశ్వం గారూ!" చటుక్కున అనేసింది ఆ మాట

అవాక్కయిపోయాడు విశ్వం

"ఏం? ఎందుకని?" ఒతడి కంఠం జీర బోయింది

"చెప్పలేను అయినా అది నా వ్యక్తిగత విషయం"

"అలాంటప్పుడు ముహూర్తం వరకు ఎందుకు రానిచ్చావ్ పరిస్థితిని?"

"నాన్నగారికి చెబుదామనుకొనీ "

"చెప్పలేకపోయానంటావ్ నీ మాటలు నేను నమ్మను సుజాతా నువ్వు కానిపోని ఆలోచనలకు పోతున్నావ్ "

"లేదు నన్ను చేసుకొని మీరు సుఖపడలేరు నేను శాంతిగా బ్రతకలేను"

"ఊహలన్నీ నిజాలు కావు సుజాతా"

"కావచ్చు కాకపోవచ్చు అది వేరే విషయం నా తల్లిదండ్రుల తర్వాత నన్ను ఒక వ్యక్తిగా గుర్తించిన మొదటివారు మీరే మీ సహృదయాన్ని ఏనాటికీ మరిచిపోను అయితే వ్యక్తిగతంగా నాకూ కొన్ని అభిప్రాయాలుంటాయి వాట్ని పరిగణనలోకి తీసుకోవలసిందిగా అర్థిస్తున్నాను"

"యదార్థాన్ని నేనెప్పుడూ గౌరవిస్తాను కానీ, సుజాతా నువ్వు త్వరపడి నిర్ణయాలు తీసుకుంటున్నావ్"

"లేదు చాలా చాలా ఆలోచించాను నేను కురూపిని ఇపుడు ఏవో ఆదర్శాలకుపోయి మీరు చేసుకున్నా తర్వాత జీవితాంతం నన్ను గురించి కుమిలిపోతారు ఎంతటి విశాలహృదయులైనా — ఆ సంకటస్థితి మీకు తప్పదు"

"నీవనుకుంటున్నవన్నీ నిజాలు కావు"

"లేదు విశ్వంగారు నా ఊహలు ముమ్మాటికీ నిజమే ఏదో భూమ్మీద పుట్టినందుకు — నన్నిట్లా ఒంటరిగా బ్రతకనివ్వండి బ్రతికినంతకాలం లంతేకానీ, నన్ను మానసిక క్షోభకు గురిచేయొద్దు"

" . "

"మీరు నన్ను గురించే ఆలోచిస్తున్నారుకానీ మీమీదే ఆశలు పెట్టుకొని, అవి నెరవేరవని తెలిసి

# కాలమిచ్చిన తీర్పు

లోలోపల కృంగి కృశించిపోతున్న మరో వ్యక్తిని గుర్తించటంలేదు"

"ఎవరు? సుమా?"

"అవును అన్నివిధాలా యోగ్యురాలు దాన్ని చేసుకొంటే మీరూ సుఖపడతారు అదీ సంతోషపడుతుంది"

"...అలా వీలుపడదు సుజాతా! నేను యిదే విషయం సుమకు ఎప్పుడో స్పష్టంచేశాను"

"అలా జరిగింది — మా పెద్దల భయంచేతే"

"కాదు నా అంతరాత్మ ప్రబోధం అది నేనెప్పుడూ ఒకమాటమీదే నిలబడతాను సుజాతా!"

"మీకై మీరు మాట తప్పటంలేదుకదు? నాకై నేను చెబుతున్నాను"

"నీ త్యాగానికి అర్థంలేదు సుజాతా"

"ఎందుకులేదు? నా చెల్లెలు సుఖంగా బ్రతుకుతుంది మీరు దాని మాట తిరస్కరించింది మొదలు అది లోలోపల ఎంతో బాధపడుతోంది పిచ్చిదైపోతోంది. ఆ పిచ్చిలోనే అది యెన్నడూ లేంది రమేష్ బావతో తిరుగుతోంది మొన్న సమయానికి మా నాన్నగారే వెళ్ళకపోతే దాని బ్రతుకే సర్వనాశనమైపోయేదట! మీరు అవునంటే యీ అవస్థే వుండదు దానికి మనసు స్థిమితపడుతుంది మీరు సుఖంగా బ్రతుకుతుంటే చూసి సంతోషిస్తాను"

"నీవేం చేస్తావ్"

"ఆయుష్షు కోసం బ్రతుకుతానని చెప్పానుగా?"

"నీవు చెప్పినట్లు ఏనాటికీ చేయలేను సుజాతా"

"అయితే మిమ్మల్ని నేనూ చేసుకోను అంతే కాదు తక్షణం మీరు మా యింట్లోంచి వెళ్లిపోండి లేదా మీరు తాళి కట్టగలిగేది నా కళ్ళెకి మాత్రమే."

సుజాత మాటలు విని రాతిబొమ్మ అయిపోయాడు విశ్వం

ఇక అక్కడ నిలబడలేక గది యివతలకు వచ్చిన సుజాత — టక్కున ఆగిపోయింది

కన్నీరు జాలువారుతూండగా సుమ ఎదురొచ్చి— "అక్కయ్యా" అంటూ సుజాతను కౌగిలించుకొంది

సుజాత ఏం చేయాలో, చెల్లెలికి యెలా నచ్చచెప్పాలో తెలియక తికమకపడింది

"మనిషిని చూశాను కానీ, నీ మనసును గమనించలేకపోయాను. మొదట్నుంచీ నువ్వు నన్ను చెల్లెలిగా చూస్తూ ప్రేమిస్తున్నావు కానీ, నిన్ను అక్కగా గౌరవించలేకపోయాను నేను మూర్ఖురాలిని . నన్ను క్షమించు నిన్ను మనిషిగా గుర్తించమని విశ్వంగారు అంత చెప్పినా ఆయన మాటలు వినలేదు కూరూపివి — అలాంటి నీలో మనసు ఉండదనుకున్నాను ఆశలకు చోటు లేదనుకున్నాను. అందుకే ఆయన్ని నేను ప్రేమించాను అతణ్ణి చేసుకొనే అర్హత నాకే ఉందని పొంగిపోయాను కానీ, విశాల హృదయంతో విశ్వంగారు నాకు నిజమేమిటో గుర్తుచేశారు అంతటితో నేను విరక్తి చెందాను. పర్యవసానంగానే రమేష్‌తో పరిచయం పెంచుకున్నాను. సుఖంగా బ్రతకాలని కాదు ఆ బ్రతుకును అంతం చేసుకోవాలని భావ సంగతి నాకు తెలియంది కాదు తెలిసీ నేనలా ప్రవర్తించాను అదృష్టవశాత్తూ ఆనాడు నాన్నగారు అడ్డుకోకపోతే — అప్పుడే నేను ఆత్మ త్యాగం చేసుకొని ఉండేదాన్ని విశ్వంగారు నన్ను కాదన్నారని నిన్ను నిందించాను కానీ, ఈవేళ విశ్వంగారితో నీవు మాట్లాడిన మాటలు విన్నాక — నాకు తల బద్దలు కొట్టుకొని ఇక్కడికిక్కడే చచ్చిపోవాలని పించిందక్కయ్యా సర్వావస్థల్లోనూ నా మేలు కోరే అక్కయ్యవు — నువ్వు నాకెప్పుడూ ఉండాలి. శారీరకం భగవంతుడు ఏ లోపం పెట్టని నన్ను ఎవరైనా చేసుకుంటారు కానీ, ఈ అదును తప్పితే విశ్వంగారిలాంటి మనసుకల మనిషి మరొకరు దొరకరు మనకు అతణ్ణే నువ్వే చేసుకోవాలి జీవితాంతం సుఖంగ బ్రతకాలి ఇది పైపై మాటలు కావక్కయ్యా నా హృదయాంతరాళాలలోంచీ వస్తున్నవి నీ విషయంలో నేను పూర్తిగా మారిపోయాను" సుమ పరితాపంతోకూడిన ఆవేశంతో చాలా చాలా మాట్లాడింది

సుమ నిజంగానే మారింది అందుకు ప్రత్యక్ష సాక్ష్యం అది తనను "అక్కయ్యా" అని పిలవటం ఏనడూ పేరు పెట్టి "సుజా" అని పిలవటం, లేదు పేరూ ఊరూ లేకుండా సౌంజ్ఞలతో పిలవటం దానికి అలవాటు అలాంటిదిప్పుడు "అక్కయ్యా" అని అమృతప్రాయంగా పిలుస్తోంది అది మారిపోయిందనటానికి ఇంతకుమించి మరో నిదర్శనం ఏం కావాలి?

అంతేకాదు అది తన హృదయాన్ని గుర్తించింది తన త్యాగాన్ని అర్థం చేసుకొంది ఇంతకు మించి తనకేం కావాలి? — సుజాత ఆనందానికి పట్టపగ్గాలు లేవు

ఆ అక్కా చెల్లెళ్ళ అనురాగాభిమానాలను చూసిన విశ్వం కళ్ళు మెరిసిపోయాయి

"రా అక్కయ్యా" అంటూ సుజాతను చెయ్యి పట్టుకొని విశ్వం గదిలోకి తీసుకొచ్చింది

[ ఇంకా వుంది ]

'మగాడు'లో మంజుల, ఎన్ టి ఆర్.



# పెరిగే ప్రతి దశలోనూ శరీరానికి కావాలి

# కాల్షియం-శాండోజ్®



కాల్షియం, గర్భంలోని శిశువు ప్రథమ దశలోనే పాప పళ్ళలోనూ, ఎముకలలోనూ చేరు కోవటం మొదలెడుతుంది. పుట్టబోయే శిశువుకు శీఘ్రగతిలో ఎక్కువగా కాల్షియం కావాలి. అందుకే, మీకు మామూలు కన్న రెండు రెట్లు కాల్షియం కావాలి. మీరు తొందర గానే కాల్షియం-శాండోజ్ తీసు కోవటం మొదలెట్టండి.



పాప ఎముకలు, పళ్ళూ పటిష్టత కోసం కాల్షియం లభించేది పాలిచ్చి పెంచే తల్లి ద్వారానే. ఆమెకు మామూలుకన్న మూడు రెట్లు కాల్షియం అవసరం.

పెరిగే పాపకు పటిష్టమైన ఎముకలూ, గట్టి పళ్ళ కోసం కాల్షియం ముఖ్యావసరం. అందుకే, పెద్ద వాళ్ళ కన్న, పాపకు కాల్షియం ఎక్కువగా కావాలి!





కాల్షియం ప్రతి దశలోనూ, ప్రతి వయసులోనూ, శరీరానికి కీలకమైన అవసరం. మరి కాల్షియం-శాండోజ్‌లో, కాల్షియం ఉత్తమోత్తమైన-రూపంలో ఉంది. రోజుకు రెండు సార్లు, రెండు లేదా మూడు రుచిగల, రాస్ప్ చెరీ-వాసన గల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు, మీకు అవసరమైన కాల్షియం యిస్తాయి. దానితో బాటే విటమిన్ సి, డి మరియు బి$_{12}$.

**శాండోజ్‌ను విశ్వసించండి-ప్రపంచమంతటిలో కాల్షియం తయారీలో అగ్రగాములు.**




## కాల్షియం-శాండోజ్®
## బిళ్ళలు ప్రతి రోజూ ప్రతి వారికీ

dCA/CS/15 F TEL

# హ్యాట్ ట్రిక్ హీరో శోభ

**ఆంధ్ర సచిత్ర వార పత్రిక సహా నిర్వహించబడిన సినిమా బాలట్‌లో వరుసగా నాయకుడుగా) శోభన్‌బాబును ప్రేక్షకులు ఎంపిక చేసినందుకు. పత్రికా ముఖంగా**



'మొనగాడు' శోభన్‌బాబు

ఫిలింఫేర్ పత్రికవారి బాలట్‌లో వరుసగా రెండు ఏండ్లు, ఆంధ్ర సినీగోయర్స్ అసోసియేషన్ వారి బాలట్‌లో వరుసగా నాలుగు సంవత్సరాలు శోభన్‌బాబు ఉత్తమ నటుడుగా ఎన్నికయ్యారు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారిచే ఉత్తమ చిత్రాల కథానాయకుడుగా మూడుసార్లు శోభన్ గౌరవించబడ్డారు

ఇంతటి ఘనవిజయాన్ని సాధిస్తున్న శోభన్‌బాబు యిప్పటికీ తనొక విద్యార్థి అని నమ్మడంవల్లనే, చిత్ర చిత్ర ప్రవర్ధమాన మవుతున్నాడేమో!

**పదహారేండ్ల కృషి !**

చిత్ర పరిశ్రమలో కాలూని పదహారేండ్లు దాటాయి కృషితో తారాపథంలో అగ్రస్థానాన్ని అలంకరించిన శోభన్‌బాబు ప్రజలిచ్చిన స్థానాన్ని పరిరక్షించుకునేందుకు ప్రతిభను ప్రదర్శించే నటనా శక్తిని పొందియున్నారు

**సినిమాస్కోపు నాయకుడు**

ఈ ఏడు శోభన్‌బాబు మూడు సినిమాస్కోపు కలర్ చిత్రాలలో నటించబోతున్నట్లు చెప్పారు "మాధవీ . పద్మాలయా కంబైన్స్‌వారి కురుక్షేత్రం, దాసరిగారి ఏకలవ్య; జ్యోతి శేఖర్ బాబుగారి ధర్మచక్రం"

**అభిమానుల ఆశీర్వాదం**

లక్షలాది ప్రేక్షకులు వర్షించే అభిమానపు అక్షతలు దేవుని దీవెనలతో సమానం అంటారు, హీ—మాన్ తనకు వచ్చే వుత్తరాల్లో సభ్యత, సంస్కారం నిండివుంటాయి అని, ఎనిమిదేండ్ల బాలుడు మొదలు, అరవై ఏళ్ల వృద్ధుడు కూడా అభిమానించడం అదృష్టంగాభావిస్తున్నారు,శోభన్

**మకుటం చేసిన మంచి**

"మానవుడు . దానవుడు, ఖయిదీబాబాయ్, జేబుదొంగ, సోగ్గాడు, సంపూర్ణ రామాయణం" చిత్రాలు తన అంతస్తును పెంచిన నిజాన్ని శోభన్ అంగీకరించి, మకుటం చేసిన మంచిని మరువలేను అన్నారు, అందాల నటుడు

రాబోయే చిత్రాలలో టైటిల్ రోల్ వున్న వాటిని, ప్రేక్షకులు ఘనంగా ఆదరించగలరన్న నమ్మకం తనకున్నట్లు చెప్పి, అలాంటి నమ్మకానికి గల కారణాలను వివరించారు



'త్రిమూర్తి ప్రొడక్షన్స్'లో మంజుల, కృష్ణ

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ నిర్మించిన "రాజు వెడలె" చిత్రానికి, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న "మొనగాడు" చిత్రానికి, అనిల్ ప్రొడక్షన్స్ తలపెట్టిన "పొగరుబోతు" చిత్రానికి ఎంతో వ్యత్యాసం వున్నట్టే, తన పాత్రల్లో లంతటి తారతమ్యం ప్రేక్షకులు పసిగట్టగలరని శోభన్ విశ్వసిస్తున్నారు

**ఆరు చిత్రాలు మాత్రమే**

సంవత్సరానికి ఆరు చిత్రాలు మాత్రమే లనవి విడుదలవుతాయని, ఒక చిత్రానికి మరొక చిత్రానికి నడుమ ఆరు వారాల గ్యాప్ వుండే విధంగా తన నిర్మాతలను కోరబోతున్నట్లు, హీ—మాన్ చెప్పారు

**కొత్త చిత్రాలు !**

డి వి ఎస్ రాజుగారి "కొంటె కృష్ణుడు" (కె విశ్వనాధ్ దర్శకుడు), సమత ఆర్ట్స్‌వారి "జూదగాడు" (వి. మధుసూదనరావు), యువ చిత్ర వారి "నెంబర్ వన్" (విశ్వనాధ్), రామకృష్ణ ఆర్ట్స్‌వారి "నెంబర్ టూ" (బాపయ్య), శ్రీ ఉమా ప్రొడక్షన్స్‌వారి "నెంబర్‌ఫోర్" (మధుసూదనరావు), చెలసాని గోపీ హరిబాబుగార్ల చిత్రం (విశ్వనాధ్), ఏకామ్రేశ్వరరావు గోపాలకృష్ణగార్ల చిత్రం (విశ్వనాధ్), పల్లనివారి చిత్రం (మధుసూదనరావు)

ఇవిగాక మరో అరడజను మందికి వాగ్దానం చేసినట్లు శోభన్‌బాబు చెప్పారు



'పొరుగింటి పుల్లకూర' లో జయచిత్ర, మురళీమోహన్

# న్ బాబు!

**మూడు వత్సరాలు ఉత్తముడుగా (కధా తన కృతజ్ఞతలు ఆయన, తెలుపమన్నారు**



### దశావతారములు

జగపతి ఫిలింస్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన పౌరాణిక చిత్రం "దశావతారములు" మన ప్రేక్షకులకు పురాణ కధలపట్ల ప్రత్యేకాభిమానం వున్న నిజాన్ని తెలిసిన నిర్మాత వి. కృష్ణప్రసాద్‌గారు మహావిష్ణువు లీలలను "దశావతారములు" పేరిట చలనచిత్రంగా నిర్మించారు

ఈ చిత్రానికి ఆరుద్ర రచన్ను, చక్రవర్తి సంగీతాన్ని, రవికాంత్ ఛాయాగ్రహణాన్ని నిర్వహించారు,

ప్రధాన పాత్రలను "షావుకారు" జానకి, ఆర్ విజయ, శ్రీదేవి, జయచిత్ర పోషించారు మహా విష్ణువుగా కొత్త -నటుడు రవికుమార్ నటించారు

"అక్కా చెల్లెలు" చిత్రాన్ని అందించిన కృష్ణప్రసాద్‌గారు నిర్మించిన రెండవ చిత్రం "దశావతారములు" అన్నపూర్ణా ఫిలింస్ యీ చిత్రాన్ని విడుదల చేస్తుంది

### జయసుధ అద్వితీయం

"జ్యోతి" చిత్రాన్ని ఎందరో చూచారు. అందరూ జయసుధ అద్భుతం. అద్వితీయం అన్నారు జయసుధలో యింతటి విశిష్టత వుందా అన్నారు మరికొందరు గ్లామర్ పాత్రలకు మాత్రమే పనికొస్తుందనుకున్నవాళ్లు గ్లిసరిన్ పాత్రలకుకూడా జయసుధ పూర్తి న్యాయం చెయ్యగలదన్న నమ్మకాన్ని వెల్లడించారు

"నేను ధరించిన ... ధరిస్తున్న పాత్రల్లో నాకు "జ్యోతి" మనస్ఫూర్తిగా నచ్చింది" అంది అందాల జయసుధ

తనకు "జ్యోతి" పాత్ర నిచ్చిన నిర్మాత క్రాంతికుమార్‌గారికి, తనచేత చక్కగా చేయించిన దర్శకుడు రాఘవేంద్రరావుగారికి కృతజ్ఞతలు తెలిపింది, జయ

"అంకుల్ కృష్ణగారితో ఒక చిత్రంలో నటించాలన్న కోరికను సుధ వెల్లడించింది.

### రకరకాల పాత్రలు

మీకు ఎలాంటి పాత్రలంటె యిష్టం అని ప్రశ్నించాను "రకరకాల పాత్రలంటె యిష్టం నటి ఫలానాపాత్రలకే పరిమితం కాకూడదు" అంది

వాంప్ వేషాలు వెయ్యడానికి అభ్యంతరమా అన్నాను. ద్విపాత్రాభినయం చేసేప్పుడయితె, అభ్యంతరంలేదు, అంది.

### నటిస్తున్న 13 పాత్రలు

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ వారి "రాజువెడలె, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి "మొనగాడు", శ్రీ ఉమా ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రం, మారుతీ ప్రొడక్షన్స్ వారి "రాజా", ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి కొత్త చిత్రం, సురేష్ మూవీస్‌వారి "సెక్రటరీ", జయ చిత్రాలయ పిక్చర్స్ వారి "కుమారరాజా", కె ఎస్ రెడ్డిగారి "సీతమ్మ సంతానం", హనుమాన్‌ప్రసాద్‌గారి "దేవుడు చేసిన బొమ్మలు", పి సి రెడ్డిగారి కొత్త చిత్రం, గజానన వారి కొత్త చిత్రం, హేమాంబరధరరావు గారి "మహానుభావుడు", నవత ఆర్ట్స వారి "అమెరికా అమ్మాయి" చిత్రాలలో జయసుధ హీరోయిన్‌గా నటిస్తున్నది.

### ఇరవైఏళ్ల అబ్బాయి !

ఏప్రిల్ రెండు, మూడు తేదీలలో జరిగిన షూటింగుతో "సెక్రటరీ" వర్ణచిత్రం పూర్తయింది. ఆఖరిరోజు షూటింగునాడు ప్రముఖ తమిళచిత్ర నిర్మాత బాలాజీ, లొకేషన్‌కు వచ్చారు నిర్మాత రామానాయుడు, దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు ఆయన్ను సాదరంగా ఆహ్వానించారు.

దూరాన ప్రేమ సయ్యాట లాడుతున్న నాగేశ్వరరావు.. వాణిశ్రీలను సమీపించారు ఎన్న సార్. ఎప్పుడ్డుకు యిరవదు దానా అని అక్కినేని యవ్వన రహస్యాన్ని ప్రశంసించారు, బాలాజీ

'మాయావి'లో హలం, చిట్టిబాబు





'జ్యోతి'లో మురళీమోహన్, జయసుధ

అదే సమయాన ఆంధ్రదేశంనుంచి వచ్చిన వందమంది నాగేశ్వరరావుగారి దగ్గరికెళ్లి, తమ అభిమాన అభినందనలు తెలిపారు వచ్చిన వందమందిలో ఒక వృద్ధురాలు కూడా వుంది "నువ్వు నూరేళ్లు వర్ధిల్లుతావు" అని అక్కినేనిని ఆశీర్వదించిన ఘట్టం, వున్నవాళ్లందరినీ జలదరింపచేసింది.

నాకొక చిత్రం చేసి పెట్టగలరా అని బాలాజీ అడిగారు తమిళం అయితే, చేస్తాను అని అక్కినేని ఛలోక్తి విసిరారు మా వాళ్లు యింకా మీ అభిమానులే అని బాలాజీ ఎదురు సమాధానం చెప్పారు

### నిర్మాతకు నాయకుని ప్రశంస

ఉత్తమాభిరుచివున్న నిర్మాతగా, వ్యాపారదక్షత వున్న నిర్మాతగా, మంచి కధలను ఎంపికచేసే నిర్మాతగా రామానాయుడుగారిని, అక్కినేని అభినందించారు. "సెక్రటరీ" చిత్రాన్ని తన అద్భుత కల్పనా శక్తితో దర్శకుడు కె ఎస్ ప్రకాశరావు రూపొందించిన నిజాన్ని, నాగేశ్వరరావు కొనియాడారు

అన్నపూర్ణ స్టూడియోస్‌లో నిర్మించబడిన ఆరంభ చిత్రానికి, ఆంధ్ర ప్రేక్షకుల ఆదరణ తధ్యము అని, అక్కినేని అభిప్రాయపడుతున్నారు.

### అక్కినేనితో "దేశంకోసం"

"సిపాయి చిన్నయ్య" చిత్రం పూర్తి కాగానే, "దేశంకోసం" చిత్రాన్ని అక్కినేనితో నిర్మించడానికి సురేష్ అధినేత నిర్ణయించారు నాగేశ్వరరావు కధ విని, గ్రీన్ సిగ్నల్ యిచ్చారు అప్పుడే "ప్రేమనగర్" ఎంపిక జరిగింది

"సెక్రటరీ" చిత్రాన్ని తమిళంలో నిర్మించిన తరువాత, అక్కినేని యిచ్చే కాల్‌షీట్లను బట్టి "దేశంకోసం" చిత్ర నిర్మాణం జరుగుతుంది, అన్నారు అగ్ర నిర్మాత రామానాయుడు



'ఉత్తమురాలు'లో జయంతి

### నటరత్న ద్విపాత్రాభినయం

ఆంధ్ర ప్రేక్షకులకు అత్యంత ప్రీతిపాత్రమైన కథానాయకుడు ఎన్టీఆర్ అని చెప్పడానికి వలసినంత అధారం లేకపోలేదు

''నిప్పులాంటి మనిషి, అన్నదమ్ముల అనుబంధం, ఎదురులేని మనిషి, మనుషులంతా ఒక్కటే'' చిత్రాలు తెచ్చిపెట్టిన వసూళ్లను పరికిస్తే, 'నటరత్న' పలుకుబడి అర్థమవుతుంది

రాబోయే చిత్రాల్లో ''మగాడు, బంగారు మనిషి'' హిట్ కాగల కథావస్తువులను కొనియున్నది

''కథానాయకుడు చిత్రాన్ని నిర్మించిన నిర్మాత కె గోపాలకృష్ణ ''మా ఇద్దరి కథ'' చిత్రాన్ని నటరత్నతో నిర్మించబోతున్నారు

ఈ చిత్రంలో ఎన్టీఆర్ వైరుధ్య స్వభావాలు కలిగిన అన్నదమ్ముల పాత్రలను పోషిస్తారు

### చాణక్య...చంద్రగుప్త !

భాగ్యనగరంలో నిర్మితమైన రామకృష్ణ సినీ స్టూడియోస్‌లో ప్రారంభమయ్యే మొదటి చిత్రం ''చాణక్య చంద్రగుప్త.'' చాణక్య పాత్రను అక్కినేని అంగీకరించడం ముదావహం. మహానటులిద్దరు కలిసి పనిచేస్తున్న ప్రారంభ చిత్రం (13 ఏండ్ల తరువాత) రామారావుగారి సొంత చిత్రం కావడం శుభావహం

ఈ యిద్దరి కలయిక ప్రేక్షకుల్లో అమితానందాన్ని, అయికమత్య భావాన్ని ఏర్పరచి, అభిమానుల మధ్య స్నేహ సఖ్యతలకు దారితీస్తుంది

### గురు శిష్యులుగా
### శివ... కేశవులు

చాణక్యుడు గురువు చంద్రగుప్తుడు శిష్యుడు ''నటరత్న'' ''చాణక్య . చంద్రగుప్త'' చిత్రాన్ని భారీ ఎత్తున నిర్మించడానికి నిర్ణయించారు

## సినిమా

శివ కేశవులు గురు — శిష్యులుగా నటించడం **ముదావహం.** పదమూడు సంవత్సరాల తరువాత కారణజన్ము లిద్దరు కలిసి పనిచెయ్యడం శుభావహం

నాగేశ్వరునిలో శివశబ్దం, రామారావులో కేశవ శబ్దం వున్నది నిజం గాబట్టే, శివ కేశవులు అని అక్కినేనిని నందమూరిని సంబోధిస్తున్నాను.

''చాణక్య చంద్రగుప్త'' వర్ణ చిత్రం చలన చిత్ర చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోగలదు కనకవర్షాన్ని కురిపించగలదు భావితరం తారలకు మార్గదర్శకం కాగలదు

### సత్య చిత్రలో రామారావు !

''తాసిల్దారుగారి అమ్మాయి, ప్రేమబంధం'' చిత్రాలను అందించిన సత్య చిత్ర అధినేతలు ''నటరత్న'' అంగీకారాన్ని యీ ఉగాదినాడు పొందారు

''బాబు, జ్యోతి'' చిత్రాల దర్శకుడు, వర్తిష్ణు యువకుడు రాఘవేంద్రరావు ఎన్టీఆర్ చిత్రానికి డైరెక్షన్ చెయ్యడం ముదావహం

చిత్రంలో ఎక్కువభాగం అవుట్‌డోర్‌లో తీయవలసి వుంటుందని, 'నటరత్న' సంపూర్ణ సహకారాన్ని యివ్వడానికి సమ్మతించారని తెలిసింది

'వసూళ్ల చక్రవర్తి' శ్రీ రామారావును సత్య చిత్ర అధినేతలు ఎంపికచేసిన నిజాన్ని ప్రేక్షకులు హర్షించగలరు

ఈ కొత్త సంబంధం తియ్యటి అనుబంధం అవ్వాలని అధిక సంఖ్యాకులు ఆకాంక్షిస్తున్నారు

### ఎన్టీఆర్‌తో జయచిత్ర

''సోగ్గాడు'' చిత్ర నాయిక, ఆనాటి నాయిక అమ్మాజీ కుమార్తె జయచిత్ర తెలుగు నటనా రాజ్యంలో ముఖ్య స్థానాన్ని ఆక్రమించే రోజు సమీపించింది

''ఊర్వశి'' శారద జయచిత్ర నటించిన ''పయనమ్'' తమిళ చిత్రాన్ని చూచి, పదే పదే ప్రశంసించిరి 'సోగ్గాడు' చిత్రాన్ని చూచిన ప్రేక్షకులు జయచిత్రకు రాసే ఉత్తరాలు చెప్పిన నిజం ఏమిటన ''వాణిశ్రీగారి లెవల్‌లో జయచిత్ర నటించింది'' అని

ఉగాది శుభాకాంక్షలు చెప్పడానికి జయచిత్ర కడకు వెళ్లాను ఆరోజున రెండు తెలుగు చిత్రాలను జయచిత్ర అంగీకరించింది

''నటరత్న''గారితో ఉదయమ్ ప్రొడక్షన్స్‌లో, మురళీమోహన్‌తో మహేష్ ఎంటర్‌ప్రైజస్‌లో నటిస్తున్న నిజాన్ని వెల్లడించింది

### మంచికి మరో పేరు

'రామారావు' అన్న నిజాన్ని నిర్మాత ఎస్. మనోహర్ తన చిత్రానికి మకుటంగా పెట్టారు.

శ్రీరామకృష్ణ చిత్ర నిర్మిస్తున్న ''మంచికి మరో పేరు'' వర్ణ చిత్రంలో 'నటరత్న' ధరిస్తున్న పాత్ర నవరసభరితమైనదన్న నిజాన్ని కథకుడు ఆర్ద్ర చెప్పారు

ఈ చిత్రంలోని కథకు పేరున్న నలుగురు నటులు అవసరం గనకనే, కృష్ణంరాజు, రామకృష్ణ శ్రీధర్‌గార్లను ఎన్నుకోవడం జరిగింది, అన్నారు దర్శకుడు సి ఎస్ రావ్

సహాయ పాత్రలను కూడా గుమ్మడి, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, ప్రభాకరరెడ్డి వంటి పాపులర్ నటులు పోషిస్తున్న నిజాన్ని, నిర్మాణ నిర్వాహకుడు విజయా జగన్నాథ్ చెప్పారు

'నటరత్న'గారి ప్రియురాలిగా నటించడం తన జీవిత భాగ్యంగా భావిస్తుంది, పద్మప్రియ మరొక ప్రధాన భూమికలో ప్రభ కనిపిస్తుంది ''మంచికి మరో పేరు'' వర్ణ చిత్రానికి ఇషాన్‌ఆర్య ఛాయాగ్రహణం సంగీతానికి రాజేశ్వరరావు, కళకు కృష్ణారావు, కూర్పుకు కోటగిరి గోపాలరావు సమపుజ్జీలే



▲ ''వామనావతారం''లో ఒక దృశ్యం

మమతానురాగాలకు మరణమే లేదని మళ్ళీ జన్మఎత్తిన
ఒక స్త్రీ నిజమైన కథ యిది!



శ్రీ వనజా మూవీస్

# వనజ గిరిజ

నిర్మాత
ఇ.కుప్పస్వామి

మాటలు,స్క్రీన్‌ప్లే,దర్శకత్వం
గౌతమ్

లక్ష్మీ ఫిలింస్

# సినిమా

### ఉదయమ్‌లో నటరత్న

ఉదయమ్ ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న తెలుగు చిత్రంలో నటించమని, మక్కల్‌తిలగం అడిగినట్లు, 'నటరత్న' అంగీకరించినట్టు తెలుస్తోంది.

తమిళంలో హిట్ అయిన "పల్లాండువాయ్‌గ" చిత్రాన్ని తెలుగులో రామారావుగారితో నిర్మిస్తున్నట్టు, దర్శకత్వాన్ని బాలన్ నిర్వహిస్తున్నట్టు తెలుస్తోంది

ఈ చిత్రంలో నందమూరి సరసన లత కథానాయికగా నటిస్తుంది

### త్రిమూర్తి ప్రొడక్షన్స్ !

ప్రారంభించిన "యాక్షన్ కమ్. లవ్" వర్ణ చిత్రం తాలుకు మొదటి షెడ్యూలు ఊటీలో జరిగిన వివరాలను గత వారం పాఠకులకు తెలిపాను

రెండవ షెడ్యూలు ఏప్రిల్ 17న ప్రారంభమై, వరుసగా పదమూడు రోజులు స్థానికంగా జరిగింది ఈ షెడ్యూలులో కృష్ణ, మంజుల, నాగభూషణం, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి పాల్గొన్నారు. రెండ



'ఈకాలపు పిల్లలు'లో రామకృష్ణ, ప్రభ

పాటల చిత్రీకరణతోబాటు, ముఖ్య సన్నివేశాల చిత్రీకరణ కూడా సంభవించింది

ప్రముఖ చిత్ర నిర్మాత డూండీగారి అధ్వర్యంలో సాంబశివరావు, బాబ్జీగార్లు నిర్మిస్తున్న వోవీరోచిత హాస్య శృంగార రసమయ చిత్రానికి భమిడిపాటి కలాన్ని, సత్యం సంగీతాన్ని, పుష్పాల చాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

అందరినీ ఆకర్షించే అంశాలను గొన్న యీ చిత్రాన్ని కె ఎస్ ఆర్ దాస్ సర్వజనరంజకంగా రూపొందిస్తున్నారు.

### కురుక్షేత్రం !

మాధవి అండ్ పద్మాలయా కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించనున్న "కురుక్షేత్రం" జూన్‌లో ప్రారంభం అవుతుందని తెలిసింది ఈ చిత్రాన్ని "పాండవ వనవాసం" ఫేమ్ ఆంజనేయులు గారు నిర్మిస్తున్నారు. అదే చిత్రాన్ని జనరంజకంగా రూపొందించిన కమలాకర కామేశ్వరరావుగారే "కురుక్షేత్రం" దర్శకత్వాన్ని స్వీకరించారు,

### శోభన్ ...కృష్ణ !

కృష్ణుడుగా శోభన్, అర్జునుడుగా కృష్ణ నటిస్తున్న "కురుక్షేత్రం" చిత్రంలో కర్ణ, సుయోధనులుగా రామకృష్ణ, సత్యనారాయణ నటించగలరని, శకునిగా జగ్గయ్య, ధర్మరాజుగా గుమ్మడి వుండగలరని, నిర్మాతల్లో ఒకరయిన మాధవీ ప్రసాద్ చెప్పారు.

### మంజుల ప్రత్యేకత

గ్లామర్‌గా కనిపించి, వయ్యారంతో ఆకర్షించి, వచ్చీరాని తెలుగుతో మెప్పించి, పడుచువాళ్ల స్వప్న సుందరిగా అంగీకరించబడిన మంజులకు ప్రజలు ప్రత్యేక స్థానం యిచ్చారుగాబట్టే, పరిశ్రమలో ఆమెకు గట్టి పొజిషన్ లభించింది.

మంజుల కళ్లలో కనిపించే తేజం, పలువరుసలో అగుపించే అందం, నవ్వులో వినిపించే మధుర స్వరం మరెవ్వరికీ లేవుగనకనే, ప్రేక్షకులు స్వప్నసుందరి అంటున్నారు.

ఒకే నటుడి సరసన ఏ హీరోయిన్ నటించినా, ప్రేక్షకులు ఓపికతో చూడలేరు. ఏ పోస్టరు చూచినా ఆ యిద్దరే కనిపిస్తే, ప్రజలు సహించలేరు.

ఈ మధ్య పనిగట్టుకుని ఒక వర్గం మంజుల పని అయిపోయింది అని ప్రచారం ప్రారంభించారు. కానీ, ప్రజల్లో మంజులకున్న బలం యిప్పట్లో అదృశ్యమయ్యేది కాదు.

### నటిస్తున్న చిత్రాలు !

"నటరత్న"గారి "చాణక్య... చంద్రగుప్త" చిత్రంలో, రాజ్యం ప్రొడక్షన్స్‌వారి "మగాడు" చిత్రంలో, రవిచిత్రవారి "నేరం నాదికాదు ఆకలిది" చిత్రంలో మంజుల ముగ్ధమోహన రూపం ప్రేక్షకులను ఆకర్షించగలదు.

జగపతివారి "బంగారు బొమ్మలు" చిత్రంలో 'నటసమ్రాట్' సరసన ఒక విశిష్టమైన వేషాన్ని మంజుల వేస్తుంది.

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి "మొనగాడు" చిత్రంలో హీ-మాన్‌కు జవరాలుగా మంజుల నటించింది

పై నుదహరించిన తెలుగు చిత్రాలుగాక, అయిదు తమిళ చిత్రాలలో, రెండు హిందీ చిత్రాలలో మంజుల కథానాయిక పాత్రలను పోషిస్తుంది

ఫేస్‌లో గ్రేస్ వున్న మంజులకు మరో అయిదేండ్లు పాపులారిటీ తగ్గదు. . తరగదు...

శ్రీనివాస్



# ప్రేమమందిరం

విశాల నేత్రాలతో నన్ను ఆరాధనగా చూస్తూ కూర్చుంది లక్ష్మి పొందికగా కుందనపు బొమ్మలా వుంది.

ప్రపంచ ప్రఖ్యాతి వహించిన ప్రేమమందిరం— తాజ్‌మహల్ ముందు మేము!

"లక్ష్మీ! నిన్ను నేను ప్రేమిస్తున్నాను" — అంతవరకు మేము అజ్ఞాత ప్రేమికులం. నేను, లక్ష్మి యూనివర్సిటీలో చదువుకుంటున్నాము ఒకరినొకరం అర్థం చేసికున్నాము. అది — యూనివర్సిటీలో మా చివరి సంవత్సరం మా ఎడ్యుకేషనల్ టూర్‌లో అనుకోకుండా 'ఆగ్రా' కూడా చేర్చబడటం మా అదృష్టం అదృష్టం — అని ఉన్నందుకు రెండు కారణాలున్నయ్. ఒకటి, తాజ్‌మహల్ అంటే నా కెందుకో చెప్పలేనంత ప్రేమ! .. ఆ చిత్రాలను, మోడల్స్‌ను సేకరిస్తాను, తాజ్‌మహల్‌ను గూర్చిన వివరాలను ఇష్టంగా చదువుతాను రెండు · అటువంటి ప్రదేశంలో ఇన్నాళ్ళూ నా గుండెల్లో గూడు కట్టుకుని, అజ్ఞాతంగా నన్ను ఉత్తేజితుణ్ణి చేసిన ప్రేమను యిలా యీనాడు నా ప్రేయసికి వ్యక్తీకరించుకునే అవకాశం లభించటం నా అదృష్టంకాక మరేమిటి??—

లక్ష్మి కళ్ళు సిగ్గుతో నవ్వాయి ఆమె లేత పెదవులు ఏదో సందేశమివ్వను విచ్చుకున్నాయి ఇంతలో ఆమె నేస్తాలు అటు రావటంతో మా ఏమాగం భగ్నమయింది లక్ష్మి మరింత సిగ్గుతో మొగ్గయి, 'ఇప్పుడే వస్తా' నంటూ వారితో వెళ్లిపోయింది

నా మిత్ర బృందం అక్కడక్కడా స్వేచ్ఛగా తిరగటం, హాయిగా నవ్వుకుంటూ కబుర్లు చెప్పకోవటం నాకు కనిపించింది నా దృష్టిని ఆ అందాల ప్రేమమందిరం మీద కేంద్రీకరించాను

ఆ చలువరాతి స్మృతి సృష్టికర్త, నిర్మాణ హృదయం, అహరహం కృషి చేసిన కూలీలు. ఓహ్ ఎంతటి ధన్యులు???

ఆ మందిరం ముందు 'శోకానికి చిహ్నాలు'— అన్నట్లు వరుసగా నాటించిన చీకటి చెట్లు

అదిగో ఆ చలువరాతి రాళ్ళల్లో వాళ్ళ కన్నీళ్ళు వారి హృదయపు ముక్కలు పేర్చి వున్నాయ్ ఆ చీకటి చెట్లల్లో ఎవరో విలపిస్తూ వున్నారు?? నిశ్శబ్దంగా రోదిస్తూ వున్నారు?? ఆ చీకటి చెట్ల వెనుక . గతంలో...

* * *

అవి మొగల్ పాదుషాలు భారతదేశాన్ని పరిపాలించే రోజులు —

పాదుషా సతీ వియోగంలో పడ్డాడు ఆమె ప్రగాఢ మధుర స్మృతి నుండి ఆ పాదుషా కోలుకోలేకపోయాడు ఆమెను అంత ప్రాణంగా ప్రేమించాడు ఆ చక్రవర్తి ఆమె లేని జీవితంలో జీవం లేదు అందుకే ప్రపంచంలో అంతవరకు ఎక్కడా కనీ, వినీ ఎరుగని వినూత్న 'ప్రేమమందిర్' నిర్మించి, అందులో తన ప్రేయసిని వీక్షిస్తూ. శేష జీవితం గడపాలి — అని ఆలోచించాడు తన ప్రేమ అనామకం కాకూడదు, శాశ్వతం కావాలి —

దేశ, విదేశాల నుండి శిల్పులను, గొప్ప కళాకారులను రప్పించాడు నమూనాలు పరికించాడు ఏవీ, అతని హృదయాన్ని కదిలించలేదు కానీ, ఒక యువ శిల్పి... పాదుషా కోరిక నెరవేర్చగల సమర్థుడుగా కనిపించాడు. ఆ యువశిల్పి ఎన్నో నమూనాలు తయారు చేశాడు. చక్రవర్తి ఎదుట ఉంచాడు. కానీ, ఏదీ పాదుషాకు సంతృప్తి నివ్వలేదు. అన్నీ బావున్నట్లే వున్నాయి. అయితే, ప్రతి నమూనాలోనూ ఏదో ఒక లోపం కనిపించి, నిరాశపరచసాగింది — అయినా ఆ యువశిల్పి మీద పాదుషాకు విశ్వాసం సడలలేదు. నిరీక్షించసాగాడు. కొన్నాళ్ళు గడిచాయి...

ఒక రోజున పాదుషా సన్నిహితుడైన ఆస్థాన కవి... రోజు రోజుకు చక్రవర్తి వదనంలో అలముకొంటున్న నిరాశా, నిస్పృహలను గమనించి యిలా అన్నాడు: "జహాపనా? ఆ యువ శిల్పి మీద నాకూ నమ్మకం వుంది. మన నమ్మకాలను అతడు వమ్ము చేయడు. అతనిలో ఆ ప్రజ్ఞ ఉంది. అయితే నా దొక్క విన్నపము. మనం ఒక్కమారు అతని నివాసానికి వెళ్లివస్తే బావుంటుంది. అతని కళామందిరాన్ని దర్శిస్తే, మీకొక అభిప్రాయం కలుగవచ్చు. తమ రనుగ్రహిస్తే, ఏమైనా ప్రయోజనం వుంటుందేమోనని భావిస్తున్నాను."

పాదుషా అనుగ్రహించారు.

ఆ యువశిల్పి నివాసంలోని 'కళామందిరం'లో అనేక ఊహలకు రూపకల్పనలు కలిగిస్తున్నాడు —

అతని గృహం ముందు చక్రవర్తి వాహనం ఆగింది. అందులోంచి చక్రవర్తి, ఆ కవి దిగారు.

ఆశ్చర్యపోయాడా శిల్పి — ఒక సామాన్యుని ఇంటికి, నిరాడంబరముగా యిలా చక్రవర్తి రావడమా? ఇది సంభవమేనా??

వినమ్రుడై వారిని సగౌరవంగా లోపలికి ఆహ్వానించాడు. సుఖాసీనులను చేశాడు.

నిర్మాణంలో వున్న అనేక నమూనాలను తిలకించారు చక్రవర్తీ, కవి. అతని ఓర్పును, నేర్పును చూచి... ఆ శిల్పిని మరింత అభిమానించారు. అతనిలోని కళాప్రతిభకు పరవసించిపోయారు. బుద్ధిగ అతని చేతిలో రూపురేఖలు దిద్దుకుంటున్న శిలలకు ముగ్ధులయ్యారు.

అల్లంత దూరాన... క్రొత్త సృష్టితో... మకుటాయమానంగా వెలిగిపోతూ... ఉన్నత స్థానాన్ని అలంకరించి ఉన్న... ఒక అద్భుతమైన నమూనా చక్రవర్తి దృష్టిని ఆకర్షించింది. పాదుషా హృదయం పొంగిపోయింది. అందులో తన ప్రియురాలు హసిస్తూ స్వాగతం పలికింది. మంత్ర ముగ్ధుడిలా అటు అడుగులు వేశాడు. అవగాహనతో అనుసరించాడు కవి కుమారుడు.

'ఇన్నాళ్ళూ యీ నమూనాను తన దృష్టికి ఎందుకు తీసుకురాలేదా?' — అని తలపోస్తూ పాదుషా... ప్రేమగా... ఆ నమునామీద చేయి వేసి, నిమరబోయాడు.

అభ్యంతరం తెలిపాడు శిల్పి.

ఆశ్చర్యపోయాడు కవి కుమారుడు.

భారతదేశ చక్రవర్తి ఆశించినదానికి అభ్యంతరం చెప్పటమా? శిరస్సు తెగి, క్రింద పడక... యింకా బ్రతికివున్నాడా ఆశిల్పి??—అనిపించిందికవికి.

కానీ, అదేం జరుగలేదు. పాదుషా అతని అభ్యంతరానికి కారణం అడిగాడు.

# గాంధీ కొండమీద మనకి చేరువగా నక్షత్రాలు

వినీలాకాశం పట్టు తివాసీ మీద వొలకబోసిన పులి కడిగిన ముత్యాల్లాగా కనపడే నక్షత్రాలు ఎన్ని? యెన్నో అన్ని— సరేగాని అందులో ఒక్కొక్కటి ఎంత పెద్దది ? భూమికన్న ''భూమిని కన్న'', సూర్యుని కన్న కూడా ఒక్కొక్క నక్షత్రం ఎంతో ఎంతో పెద్దది. శీతాకాలంలో, వేసం కాలంలో, వర్షాకాలంలో ఆకాశంమీద మిల మిల మెరిసే నక్షత్రాలు ఒక్కటేనా ! కావు.

రాసులంటే ? ఒక్కో రాశిలో యెన్నేసి నక్షత్రాలు ? సింహ రాశిలో సింహం వుంటుందా ? సూర్యు డుంటాడా ? కుజుడు, శని, భూమిని చూడ్డం అంటే ! ధ్రువతార అంటే ఏమిటది — ఎందుకలా కదలకుండా ఒకేచోట వుంటుందది ! ల్లాంటి యీ అనంత విశ్వపు వింతలను మన నెత్తి మీదికి అతి చేరువగా చిన్న ''గుడి'' లోపలకి తెచ్చి, వెలుపలి వేడి, లోపలి ఉక్కబోతకూడా తగలకుండా చూపెట్టే నక్షత్ర ప్రదర్శనశాలనే ప్లానెటోరియమ్ అంటారు. ఇటువంటిది మన దక్షిణ భారతదేశంలో ఒకేఒక్కటి వున్నది. విజయవాడ గాంధీ కొండ మీద నున్న యీ నక్షత్ర ప్రదర్శనశాల విద్యార్థులు, విద్యార్థేతరులు, జిజ్ఞాసగల వారంతా చూస్తే ఆకాశంమీద కనపడే చిత్రవిచిత్రమైన దృశ్యాలెన్నో ఆ మర్నాటి నుంచి యింకా వింతగా ఆనందకరంగా కనపడతాయి. నక్షత్ర ప్రదర్శనశాలలో వీటిని శని, ఆది వారాలు స్థానిక కళాశాలల అధ్యాపకులు విశదీకరించి చూపుతున్నారు. కొండముది హనుమంతరావు, రామానుజం (ఫిజిక్సు లెక్చరర్‌లు) గారలు ఒక ప్రత్యేక ప్రదర్శనలో నక్షత్రాలు, రాసులు, గ్రహాలు, గ్రహమార్గాలు మొదలైన వాటిని తేలికగా తెనుగులో సూటిగా అందరికీ అర్థమయ్యే రీతిలో వివరించారు. పాఠంలా గాకుండా చక్కని కథలాగా వున్న వ్యాఖ్యానంతో గంటసేపు ఎయిర్ కండిషన్డ్ ఆకాశవిహారం చేసి బయటకువచ్చే యీ అవకాశాన్నివిజయవాడ చూడవచ్చిన విద్యార్థులు వినియోగించుకొంటే ఉభయతారకం.

—[ వీరాజీ]

---

## ప్రేమ మందిరం

ఆ యువశిల్పి కళ్ళు సజలాలయ్యాయి. ప్రభువు ముందు మోకరిల్లాడు. ''క్షమించండి, జహపనా! ఇది నా ఆంతరంగిక విషయం. నా కిప్పుడు ఇరువది ఐదు వత్సరాలు. ఐదు సంవత్సరాల క్రితం నన్ను ప్రాణాధికంగా ప్రేమించి, తన అందాలతో నాలోని శిల్పికి ప్రాణాలు పోసిన... సుగుణాలఖని, సౌందర్య రాసి ఆ లోకం చేరుకున్నది, నన్నిక్కడ ఒంటరిగా వదలి. ఆనాటి నుండి 'ఆమె'ను ఈ రాళ్ళల్లో అన్వేషిస్తూ వున్నాను నేను. ఆమె స్మృతికి చిహ్నంగ యీ 'నమూనా'ను అహోరాత్రులు శ్రమించి సృష్టించాను. అందులో మా ప్రేమను నిక్షిప్తం చేశాను. అది నా ప్రాణం. అది లేకపోతే నేను జీవించలేను. ఆ నా 'ప్రేమమందిరం' నా కొక్కడికే పరిమితం. అందులో అణువణువునా నా హృదయం స్పందిస్తూ వుంటుంది. అర్థం చేసికొని, మీ మనస్సును నొప్పించివుంటే క్షమించమని ప్రార్థిస్తున్నాను.''

ఆ యువశిల్పి గుండె భారమయింది. కళ్ళల్లోంచి వెచ్చని కన్నీటిధారలు చక్రవర్తి పాదాలను తడిపాయి.

పాదుషా చలించిపోయాడు. ఈ విశాల విశ్వంలో తను ప్రేమించినట్లు... మరో వ్యక్తి స్త్రీని ప్రేమించలేదని నిరూపించేందుకే, తన ప్రేమ ఔన్నత్యాన్ని లోకానికి చూపేందుకే, చనిపోయిన తన ప్రేయసి ఆత్మకు తృప్తినిచ్చేందుకే... యీ లోకోత్తర 'ప్రేమమందిర' నిర్మాణానికి పూనుకున్నాము. అది చక్రవర్తి తనకే సాధ్యం అవుతుందని భావించాడు. ఇప్పుడు... కళ్ళెదుట... ఈ యువశిల్పి... ఒక సామాన్యుడు... ఒక సామాన్యుడు... ఇతనిలో... ఇంత ప్రేమ... ఓహ్...

సదవగాహనతో చక్రవర్తి కళ్ళు చమర్చాయి. ఆ యువశిల్పిని స్నేహభావంతో స్పృశించి, లేపాడు. అతని కన్నీళ్ళు యింకా పెరిగిన అతని నల్లని గడ్డంలోకి జారిపోతూవున్నయ్. పాదుషా అతణ్ణి దగ్గరకు తీసికొని, హృదయానికి హత్తుకున్నాడు.

నిస్తేజుడై... ఈ అపూర్వ దృశ్యానికి ప్రేక్షకుడైన కవి హృదయం ఆవేశపూరితమయింది. ఉత్తమమైన కావ్య ఉల్లేఖనానికి ఉత్కృష్టమైన యిలాటి దృశ్యమొక్కటి చాలుకదా ! — అనుకొని... కనురెప్పల్లోంచి ఉబుకుతున్న తడిని తుడుచుకొని, మహదానందం పొందాడు.

కొన్ని క్షణాలు అపూర్వమయిన ఆ కాలాన్ని ముగ్గురూ అనుభవించారు.

అనంతరం —

చక్రవర్తి అడిగాడు, ''శిల్పీ! నువ్వెంత గొప్పవాడివో, నీ హృదయమెంత కళాత్మకమో అర్థమయింది. కానీ, మీ కోరికను కాదనకు. ఆ నమూనాను మేము ఎన్నుకోవటం అత్యాశ అయినా... అది మాకు నచ్చింది.''

''మన్నించగలరు పాదుషాగారు ! మనవి చేశాను. కావాలంటే నా ప్రాణం తీసికొండి. నిరభ్యంతరంగ యిస్తాను. ఆ నా ప్రేమమందిరాన్ని మాత్రం అన్యులకు అంకితం చెయ్యలేను'' — శిల్పి వినమ్రంగా అన్నాడు.

''శిల్పీ ! కళా హృదయుడవు నీవు. ఆ మాత్రం మాలోని ఆవేదనను అర్థం చేసికోగలవనే మేము దాన్ని ఆశిస్తున్నాము. ఆ నమూనాను ప్రేమ మందిరంగా నిర్మించలేని మేము, జీవించి ప్రయోజనం లేదు.''

''క్షమించగలరు, నా సాహసాన్ని'' — శిల్పి కంఠం దృఢంగా పలికింది.

చక్రవర్తి గొంతు వణికింది, ''శిల్పీ ! ప్రేమించే హృదయం, ప్రేమించే హృదయానికే అర్థమవుతుంది. ఆ ఆశతోనే నిన్ను యింతగా అడుగుతున్నాము. మేము యీ భరత ఖండానికి చక్రవర్తులం కావచ్చు. కొన్ని లక్షల సైన్యానికి సర్వాధికారులం కావచ్చు. కానీ, మాకు తెలుసు... పాదుషాగా నిన్ను ఆజ్ఞాపించటంలేదు. ప్రేమికునిగా అర్థిస్తున్నాము.

యువశిల్పి నయనాలు అశ్రుపూరితాలయ్యాయి మళ్లీ, — అతని గుండెను ఎవరో ఇనుప గునపాలతో పెళ్ళగిస్తున్నట్లు, నిశ్శబ్దంగా బాధను భరిస్తున్నాడు.

ఇద్దరు అపూర్వ ప్రేమికుల అవస్థను అంత వరకూ తిలకిస్తున్న కవి, వాతావరణం క్షణ క్షణానికీ విషాదపూరితం కావటం గమనించి, కలుగజేసికున్నాడు. కవి ఆ యువశిల్పి భుజంమీద ప్రేమగా చెయ్యి వేసి, ''కళా హృదయా ! ప్రపంచంలో ప్రేమ స్వరూపం ఏమిటో, దాని అర్థం ఏమిటో చాలా మందికి తెలియదు మిమ్మల్ని దర్శించుకుంటే తెలుస్తుంది. ఆ అదృష్టం నాకు లభ్యమయినందుకు నేనెంతో ఆనందపడిపోతున్నాను.

కానీ, ఈ క్లిష్టపరిస్థితిలో మీరు పాదుషా గారిని అర్థంచేసికోవాలి. మీరిద్దరూ అమర ప్రేమికులు. అందుకే మీరు సృష్టించుకున్న ఆ 'ప్రేమమందిరం' మీదే చక్రవర్తికి అంత మమకారం ఏర్పడింది. ప్రేమను ప్రేమ గుర్తిస్తుంది — అనటానికి యిది నిదర్శనంకూడా. మరొక్క విషయం !

శిల్పిగా, గొప్ప కళాకారునిగా మీరు ఆ నమూనాను సృష్టించగలిగారు. అది మీ జీవితానంతరం శిథిలం అయిపోక తప్పదు. అలాకాక మీ సృష్టిని పాదుషాగారికి అనుగ్రహించినట్లయితే ... ఆ నమూనాను ప్రపంచం ఆశ్చర్యపోగల మహత్తర కట్టడంగా నిర్మించగలరు. అప్పుడు మీ యిద్దరి జీవితాశయాలు నెరవేరుతాయి. మీ తదనంతరం మీ కళాకౌశలాన్ని, మీలోని అవాజ్య ప్రేమను భావితరం గుర్తిస్తుంది. మీకు వాళ్ళు జోహారు లర్పిస్తారు. మీ ప్రేమ ఆచంద్రార్కం ఆ 'ప్రేమమందిరం'లో ప్రతిఫలిస్తూ వుంటుంది. ఆలోచించి, అనుగ్రహించండి.'' కవి ఆ మాటలు అంటూవుండగా ... యువ శిల్పి చక్రవర్తి కళ్ళల్లోకి చూశాడు.

ఆ కళాకారుడు అనుగ్రహించాడు.

మనోహరమైన ఆ నమూనా చక్రవర్తి హస్తగతం అయిన మరునాడు ... ఉషోదయానికే ఆ యువ శిల్పి మరణవార్త పాదుషాకు తెలిసి, ఆశ్చర్యపోయారు.

అతని ప్రేమ అమరమయింది—

అతని ప్రేమమందిరం — తాజ్ మహల్ అయింది ! ... ...

చంద్రోదయంలో... ఆ ప్రేమ మందిరాన్ని వీక్షిస్తూ ... ఆ చీకటి చెట్లలోంచి ... ఇహంలోకి వచ్చాను నేను, మృదువైన ఆమె చేయి నా చేతి వ్రేళ్ళను స్పృశించగనే ! !

ఆమె నా లక్ష్మి.




# ఆనంద విమానంలో అద్భుత విహారం!

విహరింపజేస్తూ క్రొత్త క్రొత్త, డీలక్స్ మిఠాయిలతో! రుచిలోనేమి, పరిమళంలోనేమి, క్రొత్త క్రొత్త అనుభవతరంగాలలో ఓలలాడిస్తుంది న్యూట్రిన్ డీలక్స్.




**ఒక్కొక్క మిఠాయియందు**
**పలరసపూరితవిందు!**

న్యూట్రిన్ కన్‌ఫెక్షనరి కంపెనీ లిమిటెడ్, పలమనేరి రోడ్డు, చిత్తూరు, ఆం.ప్ర.

# కావ్! కావ్! 'వసుధ




"అబ్బ! నల్లగా 'కాకి'లా వున్నాడే!" ఆకాశంలో ఆనందంగా ఎగురుతున్న నేను ఆ మాటలు విని, చటుక్కున ఆగిపోయి, నా శరీరంవైపు ఒకసారి చూసుకుని, మెల్లగా నిట్టూర్చి, చెట్టుమీద వాలాను.

"నల్లగా కాకిలా వున్నాడే. ఎలా ఒప్పుకోను పెళ్ళికి? బాగా ఏడిపించి పంపించాసులే!" కిలకిలా నవ్వుతూ చెప్తోంది ఫ్రెండ్స్‌లో ఒక అమ్మాయి. నాకు ఒళ్ళు మండిపోయింది, నల్లగా పుట్టించిన దేవుడి మీద, నన్ను అవహేళనచేస్తున్న ఆ అమ్మాయి మీద. 'నల్లగా పుట్టడం నేను చేసిన తప్పు కాదే? అయినా రంగుచూసి. బాహ్య అందాలకు ప్రాముఖ్యం యిచ్చే ఈ మనుషులకు ఎదుటివాళ్ళని బాధిస్తున్నామని అన్పించదా? ఇదేనా వాళ్ళ నాగరికత? యిదేనా వాళ్ళ మానవత్వం? అయినా నల్లని వస్తువులు సృష్టిలో ఎన్నో వుండగా నన్నే ఎందుకు అసహ్యంగా అపహాస్యాలకు వుపయోగించుకుంటున్నారు?' అనుకుంటూ తలతిప్పి, కిందకు చూశాను. ఆ అమ్మాయి యింకా ఏదో నవ్వుతూ, తుళ్ళుతూ వాగుతూనే వుంది. ఆ అమ్మాయి తెల్లగా వుంది. అయితే ఏం? 'కళ' అన్నది లేదు మొహాన. 'ఠీవి' అసలే లేదు. 'ఈ అమ్మాయి కూడా నన్ను వెక్కిరించేదే? తిక్క కుదురుస్తానుండు!' - కసిగా అనుకొని, సరిగ్గా ఆ అమ్మాయి తలమీదకు ఎగిరి, రెట్టవేసి రివ్వున ఎగిరిపోయాను, 'కావు, కావు'న అని నవ్వుకుంటూ. 'ఇప్పుడు ఆ అమ్మాయి మొహం కూడా అవమానంతో నల్లగా మాడి వుంటుంది'...తృప్తిగా ముందుకు సాగిపోయాను.

*　　*　　*

"అబ్బబ్బ! ఎమిట్రా, ఆ కాకిగోల?" కొద్దిసేపు కూడా నోర్మూసుకుని వుండలేరూ? మరీ 'కాకిగోల' అయిపోయింది యింట్లో." గట్టిగా, కరినంగా విసుక్కుంటునట్లు విన్పించిన కంఠానికి ఉలిక్కిపడి ఆగిపోయి, పిట్టగోడ మీద నిలబడి లోపలికి తొంగిచూశాను. అయిదారుగురు పిల్లలు ఏదో ఆట ఆడుతున్నారు. వాళ్ళ కేకలూ, అరుపులూ కలగాపులగంగా వున్నాయి, 'కాకిగోల' లాగా!

"కాకిగోలట, కాకిగోల! హుం, మేం చేసే హడావుడి అంటూ మేం సఖ్యంగా బ్రతుకుతున్నామని తెలియజేయడానికే అని గ్రహించరేం ఈ మనుషులు? మొన్న నా ఫ్రెండ్ 'రాజాకాకి' కాలు విరిగి గోలపెడ్తుంటే, నేను చూసి గట్టిగా అరవబట్టి గదూ, మిగిలిన సభ్యులంతా వచ్చి, 'రాజాకాకి'ని చెట్టుమీద చేర్చి, దానికి రెండు రోజులు అన్నం తెచ్చి పెట్టి ఎంతసేవచేశాం? మాలో మాకు చిన్న దెబ్బతగిల్తే, మాకు హృదయాలు బాధగా మూల్గుతుంటే వీళ్లకు 'గోల'గా అన్పిస్తుందేమో! ఏం మనుషులు వీళ్ళు? మొన్నటికి మొన్న ఆ కుంటోడు. చలితో రోడ్డుమీద పడి ఛస్తుంటే, కనీసం ఒక దుప్పటి కప్పలేకపోయారు. కనీసం యింత నీడ యివ్వలెకపోయారు ఎవరూ! అందరూ చూస్తూ సాగిపోయేవాడేకానీ, 'అయ్యోపాపం' అనుకున్నవాళ్లే లేరు. సాటి మనిషి చావు బ్రతుకుల గురించి ఆలోచించడంకూడా చేతకాని ఈ మనుషులు, మా 'సఖ్యత' నేర్చుకోవాల్సిందిపోయి, మమ్మల్ని 'కాకిగోల' అంటూ ఈసడిస్తున్నారు. తలతిప్పి, ఒక కన్నుతో లోపలికి తొంగి చూసాను మరోసారి. పిల్లలు ఆట ఆపేసారు. ఏదో తిండి చేతిలో పెట్టుకొని, 'కరకర' నములుతున్నారు. అయిదు నిముషాలు చూసి చటుక్కున లేచి, వరండాలో నిల్చుని బాబు చేతిలో 'తాయిలం'నోట కరుచుకుని, రివ్వున పైకి లేచిపోయాను.

*　　*　　*

"కాకి పిల్ల కాకికి ముద్దు!" పక్కామెతో మాటలు దొర్లిస్తున్న ఓ యిల్లాలు అంటోంది. ఎన్నాళ్ళకు నా మాతృత్వపు విలువను, నా గొప్పదనాన్ని గురించి మాట్లాడే మనిషిని చూశాను'? వాళ్ళకు కొద్దిగ దూరంలో వేపచెట్టు మీద ఆ మాటలు అంటున్న ఆమె చేతిలో సంవత్సరం నిండిన పసిపిల్లవాడు వున్నాడు. చిన్నశరీరం, పెద్దతల, ఒక్క వెంట్రుక కూడా లేకుండా బోడితలతో అసహ్యంగా, వికారంగా వున్నాడు. ఆమె

# మీ బిడ్డకు 3 నెలలు నిండాయా?

3 నెలలు నిండిన మీ బిడ్డలను
కేవలం పాలతోటే సరిపెట్టేయకండి;
వాళ్ళకి బలమైన రక్తం కోసం,
ఐరన్‌తో నిండిన శక్తినిచ్చే (ఘన)
ఆహారం అవసరం—అని
డాక్టర్‌లు అంటున్నారు:



ఫారెక్స్‌ను ఇవ్వండి.
ఇది ఐరన్‌తో నిండినదే
కాక, శక్తినిచ్చే (ఘన)
ఆహారం కూడా!

ఒక్క ఫారెక్స్ మాత్రమే
మీ బిడ్డ పెరుగుదలను బట్టి,
అవసరమైన ఆహార పదార్థాలను
బిడ్డకు అందివ్వడంలో మీకు
తోడ్పడుతుంది.

పెరుగుతూన్న మీ బిడ్డకి ఫారెక్స్
ఏమేమి యిస్తుందో చూడండి.

- రోగ నిరోధక రక్తం శక్తి కోసం [illegible] ఐరన్
- పళ్ళు, ఎముకలు బలంగా ఉండటానికి కావలసిన కాల్షియం మరియు విటమిన్ డి
- బాగా పెరిగేందుకు [illegible] ప్రోటీన్
- ఆ వయసుకు ఆయుర్దాయం, అందుకు కావలసిన బలం

మీ బిడ్డ పెరుగుదలతో పాటు ఫారెక్స్ ఎంత ఇవ్వాలో తెలుసా

| బిడ్డ వయస్సు | ఎంత ఫారెక్స్ ఇవ్వాలి |
|---|---|
| 3—6 నెలలు | 1—2 చిన్న చెమ్చాల నిండుగా రోజుకు రెండు సార్లు |
| 6—9 నెలలు | 3—4 చిన్న చెమ్చాల నిండుగా రోజుకు మూడు సార్లు |
| 9 నెలలు—1 సంవత్సరాలు | 4—6 చిన్న చెమ్చాల నిండుగా, రోజుకు నాలుగు సార్లు |




## ఫారెక్స్

3 నెలలు దాటినప్పటినుంచి సంపూర్ణమైన పెరుగుదలకు
మీ బిడ్డయొక్క మొట్టమొదటి ఘన ఆహారం

ఉచితం: ఫారెక్స్ గురించిన పుస్తకం ఉచితంగా [illegible]

గ్లాక్సో

CMGF-46-234 TEL

# కావ్ ! కావ్ !

ఆ బాబునే పదిలంగా హృదయానికి హత్తుకుని నిల్చుంది. "ఆఁ! అయినా మీ వాళ్లు ఎలా చేశారండీ మీ పెళ్లి ? ఆయన నలుపే వచ్చింది వీడికి. యిలాంటి జబ్బులు కూడా వారసత్వాల వల్లనే వస్తాయని అంటున్నారు డాక్టర్లు. 'కాకి ముక్కుకు దొండపండు' లా అందంగా వున్న మీకూ, ఆయనకూ, ఎలా పెళ్లి జరిగిందా అని ఆశ్చర్యంగా వుంటుందంటే నమ్మండి." పక్కింటావిడ తన సానుభూతినంతా మాటల్లో ప్రదర్శించాలని తాపత్రయ పడిపోతోంది. ఆవిడ మాటలు వింటుంటే నాకు 'ముక్కుతో ఒక్కపోటు పొడుద్దామా ?' అన్పించింది. బాబుతల్లి "పెళ్లిళ్లు ఏనాడో నిర్ణయించబడి వుంటాయండీ! కావల్సింది బాహ్య సౌందర్యం కాదు, మనసూ, గుణం. నా భర్త రంగు తక్కువైనా, ప్రేమ ఆప్యాయతలతో నన్ను జయించారు. ఆయన రూపం గురించి నేను ఎప్పుడూ ఆలోచించలేదు, బాధపడలేదు. బాబు యిలా పుట్టడం నా దురదృష్టం. పిల్లలు ఎలావున్నా పారేయలేం కదా ? నా బిడ్డ నాకు ముద్దే! నాకు పనుంది వెళ్తానండీ!" అంటూ గబగబా లోపలికి వెళ్లిపోయింది, బాబును మరింతగా గుండెలకు హత్తుకుంటూ. తమ వయసు తగ్గించుకోవడానికి పిల్లలను యింట్లో వదిలేసి, ఒంటరిగా షికార్లు గొట్టే పడతులు, పిల్లలకు పాలిస్తే తమ సౌందర్యం పాడయిపోతుందని పిల్లలను ఆయాలకు, పాలడబ్బాలకు అప్పగించి, బయట తిరిగే వనితలూ, పెళ్లి కాకుండా పిల్లల్నికని, ధైర్యంగా సంఘాన్ని ఎదుర్కొనే గుండెలు లేక, పురుట్లోనే పిల్లల గొంతు పిసికిపారేసే తల్లులు వున్న ఈ కాలంలో, అనాకారంగావున్నా, అసహ్యంగా వున్నా 'తనబిడ్డ తనకుముద్దే' అనగలిగినధైర్యం వున్న ఈ యిల్లాలును చూడ్డం నాఅదృష్టం అనుకున్నాను. మెల్లగా తల తిప్పి యింట్లోకి చూశాను. బాబును వుయ్యాల్లో పడుకోబెట్టి. చల్లగా జోలపాడి నిద్రపుచ్చుతోంది తల్లి. ఆ చల్లని తల్లికి నా 'జేజేలు' చెప్తూ, 'కావు, కావు, కావ్, కావ్' అంటూ గగనంలోకి సాగిపోయాను.

ఎండ తీవ్రత తగ్గిపోయింది. అలాగే సాగిపోతూ, సాగిపోతూ ఊరిబయట శ్మశానంలోకి వచ్చేశాను. నాకు ఈ ప్రదేశమంటే చాలా యిష్టం. నిశ్శబ్దంగా విషాద గీతాలు ఆలపించే ఈ 'భూమి' తీవిగా నిల్చుని, 'ప్రపంచ విశ్రాంతిశాల'ను చేరుకుని, తమను చేరవచ్చే మిత్రులను నిశ్శబ్దంగా ఆహ్వానించే 'సమాధు'లు, నాకు ఎంతో అందంగా కన్పిస్తాయి. ఈ భూమిలో కక్షలూ, కావేషాలూ లేవు. ఆ లోకంలో హేళనలూ, వెక్కిరింతలూ లేవు.

చల్లగా, మెల్లగా విన్పించే ఈ పాటలు అమ్మ జోలపాటలా విన్పిస్తుంటే, అలాగే ఈ మోడువారిన చెట్టుమీద నిలిచి, నేనూ ఏదైనా సందేశం యివ్వాలనిపిస్తుంది. 'తోటి ప్రాణులను అవహేళన అనే బాణాలతో బాధ పెట్టవద్దని, బాహ్యసౌందర్యం గమనించడం మాని, మనసు లోతులను స్పృశించమని, యింకా యింకా ఎన్నో? కానీ నేనేం చెప్పినా, 'కాకిగోల' అవుతుంది" ఆలోచనలో కొట్టుకుపోతున్న నేను, 'కా! కా! కా!' అని విన్పించడంతో తలతిప్పి, కిందకు చూశాను. శ్మశానాన్ని చేరిన పెద్దమనిషి తాలూకు పిండాలు తినడానికి ఆహ్వానిస్తున్నారు యిద్దరు మనుషులు. నా మిత్రులంతా గోలగా అరుచుకుంటూ. దూరంగా ఎగిరిపోతున్నాయి. ఏం పాపాలు చేశాడో? ఎందరి సంసారాలు కూల్చాడో? ఎన్ని ప్రాణాలు తీసాడో? అందుకే ఆ 'పాపపు పిండం' ముట్టుకోకుండా పోతున్నారు నా మిత్రులు. ఈ మనుషుల్లా 'పాపపు తిండి'కి ఆశించని, నా జాతి నిజాయితీ మీద నాకు గర్వం కలిగింది. ఆనందంగా 'కా, కా, కా' అని అరిచాను గట్టిగా. నా మిత్రులంతా దూరంగా వెళ్ళిపోయారు. నేనొక్కదాన్నే మిగిలిపోయాను ఈ చెట్టుమీదనుంచి చూస్తూ. వాళ్ళింకా ఆశగా, నా వైపే చూస్తూ అరుస్తున్నారు. నాకు వాళ్లని కాసేపు ఏడ్పించా లనిపించింది. లేస్తున్నట్లు లేచి, ఆ చెట్టుమీద, ఈ చెట్టుమీద వాలుతూ పావుగంట వాళ్లను అరిపించాను. వాళ్ల నిస్సహాయతకు నవ్వు కూడా వస్తోంది. చివరకు విసుగుపుట్టినట్లుంది వాళ్లకు. "హూష్ కాకీ!" అని గట్టిగా అర్చారు. అందితే జుట్టు, అందకపోతే కాళ్లూ పట్టుకొనే ఈ మనుషులంటే నాకూ అసహ్యమే! 'నేనూ యిక ఎక్కువసేపు వీళ్ళ ఎదురుగా నిలవలేను' అనుకొని, రెక్కలు టపటపా విదిలించి, రివ్వు రివ్వున గూటివైపు సాగిపోయాను '—కావ్! కావ్' మంటూ

## సామాన్యుని సణుగుడు

### త.రాలు: అంతరాలు

సినిమావాళ్ళు 'మాస్'
కోసమంటూ చెత్త సిన్మాల
తీస్తుంటారు—
అంటే, మాస్ అన్నది
అలా 'మాస్' గానే
ఎన్నాళ్ళైనా వుండాలన్నది
వాళ్ల మనోభీష్టం
క్లాస్ కూడా వేరే గతిలేక!
మాస్ పిక్చర్లే చూస్తారు కనుక!

అట్లాగా ఏలినవారు వెనుక
పడ్డవాళ్ల కోసం
కేటాయింపులు చట్టాలు
చేస్తుంటారు

అలా వెనుకపడ్డవాళ్ళు
వెనుకపడ్డట్టే వుండాలన్నట్టు!
వెనుకపడ్డం సంప్రదాయంలాగ.

కులాలకి కేటాయింపులున్నంత
కాలం మతాల మధ్య
ట్రీట్‌మెంట్‌లో అంతరాలున్నంత
కాలం కుటుంబనియంత్రణ
శస్త్రచికిత్సలకే అడుగడుగునా
చిక్కులు ఎదురవుతున్నవే
మరి సంఘ సంస్కరణ
అనే మేజర్ ఆపరేషన్
సాధ్యం అయ్యేది ఎట్లా? అని

కొన్నాళ్ళైనాక 'మాస్'
'క్లాసు' అయిపోయి సినిమా
డబ్బాలు తిరగ్గొట్టేస్తే
బాగుంటుంది కదూ! దాంతో
ఎవడూ 'చెత్త' తీసి
'మాస్' కోసం అంటూ నెత్తిన
రుద్దులేడు! రుద్దినా
ఎవడూ రుద్దించుకోడు

అలాగే కొన్నాళ్లకి
వెనుకపడ్డతరం ముందు
పడ్డ జనం అంతా కలసి
రేసుగుర్రాల్లాగా ముందు
పడ్డంకోసం పరిగెడితే
అప్పుడింక కేటాయింపులు
వేర్పాటు ఏర్పాట్లు
రిజర్వేషన్‌లు వుండవు కదూ

అయితే పరిగెట్టాలన్న
పట్టుదలకి చైతన్యపు
చెర్నకోలు తొడిగే తరం
ఎవరు? యువతరం
వీళ్ళ అభిమాన సంఘాల
పంకిలాలనుంచి, దుర
భిమాన శృంఖాలను త్రెంచి
ముందుకొస్తే చాలదా?
సామాన్యుడు సణుగుడు
మాని సంచలనానికి
గొంతు సాగదియ్యడానికి ?!
కాని వాళ్లెప్పుడు
రేసుగుర్రాలవుతారా? అని.

[వీరాజీ]

---

## వెలుగు బాట

(14వ పేజీ తరువాయి)

సేపు అల్లరి చేయాలనిపించింది. "ముందు నీ ప్రశ్న పత్రాన్ని నాకిచ్చేస్తే, వాటికి జవాబులు నింపి యిచ్చేస్తాను. ఆ కలం, కాగితం ఇలా పడేయ్!" అంది. "తల్లీ. ఎండలో వచ్చినట్లున్నావ్. కాస్త రిమ్మెత్తిపోయినట్లున్నావ్. కాసిన్ని మంచి తీర్థాన్ని సేవించు తల్లీ. తరువాత కాఫీ పోస్తాలే. కళ్లలా తేలవేయకప్పుడే!" అని చివాల్న లేచి గ్లాసుడు మంచినీళ్ళు తెచ్చిపెట్టి, 'త్రాగు' అని చిరుకోపంతో, స్టౌ ముట్టించి కాఫీ నీళ్లు మరిగించి, కాఫీ కలిపి కృష్ణవేణి ముందు కాఫీ కప్పు నుంచుతూ, "దేవీ! స్వీకరించి, మమ్మనుగ్రహించు తల్లీ." అంది.

"మై సిల్లీ గర్ల్." అని మయూరి బుగ్గపై ముద్దు పెట్టుకుని "చాల రోజులయింది కదులే నీచే చీవాట్లు కాసి." అని అంది. "చాల్చాల్లే: ఉద్ధరించావ్. ముందు కాఫీ త్రాగు. చల్లారిపోతుంది." కాఫీ త్రాగుతూ, "మరి నువ్వేం ప్రశ్నలు వేయనక్కర్లేదు. నా జవాబులు జాగ్రత్తగా విను. రెండోసారి అడిగితే ప్రశ్నకు కాఫీ యివ్వాల్సి వస్తుంది. మా వాళ్లంతా క్షేమం. ఒక్కయ్య మామూలే. రాజు అమెరికాలో ఉన్నాడు. నేను థర్డ్ బి. ఎస్సీలో ఉన్నాను. అయిపోయింది కదా? ఇక — నేనిక్కడికి ఎందుకు వచ్చాను? ఎలా వచ్చాను? అదే నీ ధర్మ సందేహం అనుకుంటాను. 'రమాదేవి' అని మా క్లాస్‌మేట్ ఫ్రెండ్ ఓ అమ్మాయికి ఈ రాజమహేంద్రవరంలోనే వివాహం జరిగింది. ఏతత్శుభముహూర్తమునకు బంధుమిత్ర సపరివారాల్లేకుండా ఒక్కర్తె నే వచ్చాను. ఇప్పుడు నీముందు కూర్చున్నాను. ఒక్కసారాగు. ఈ కాఫీ కొంచెం మిగిలిపోయింది." అని రెండు గుటకల్లో కాఫీ కప్పు ఖాళీచేసి, "ఇప్పుడు చెప్పు నీ సంగతి?" అని అంది కృష్ణవేణి.

"ఒక్క షరతు. నువ్విలా వాగకు. నోర్మూసుకుని కూర్చోకు. మామూలు ధోరణిలో మాటాడితే మాటాడు. లేకపోతే వెంటనే ఫో," కృష్ణవేణి మయూరి ముఖంలో కనిపిస్తున్న చిరాకును చూస్తుంటే తెగ నవ్వు వస్తోంది.

ఆ తరువాత ఇద్దరూ చాలసేపు మాటాడుకున్నారు. ఆ రాత్రి కూడా అక్కడే ఉండిపోయింది కృష్ణవేణి. రాత్రి భోజనాల దగ్గర కూర్చున్నపుడు అడిగింది కృష్ణవేణి. "మీ ఆయన ఏరని?"

"వాళ్ల చెల్లెల్ని తీసికొని కాకినాడ వెళ్ళారు." మయూరి చెప్పింది భోజనం ముగించి చెయ్యి కడుక్కుంటూ, "అదిసరే. మరి నువ్వెప్పుడు పెళ్లి చేసుకుంటావ్. ఏమిటి సంగతి?" అని ప్రశ్నించింది?

"ఆ విషయం తరువాత మాటాడుకుందాంలే. ముందివన్నీ పూర్తికానీ" అని కృష్ణవేణి కూడా భోజనం అయి, చేతిని కడుక్కుని లేచింది. పడుకోబోయే ముందు "మయూరీ! నాకో సమస్య వచ్చిపడింది. అందునుంచి నిన్నో ముఖ్యమైన సలహా అడగాలనుకుంటున్నాను. ఇప్పుడడగనా?" సీరియస్‌గా ముఖంపెట్టి అంది కృష్ణవేణి.

"ఏమిటే అంత చిక్కు సమస్య?" ఆసక్తిగా అడిగింది మయూరి. కృష్ణవేణి కొద్దినిమిషాలపాటు మౌనంగా ఊరుకుని, "ఈ సంవత్సరం చదువు పూర్తయిన తరువాత నాన్నగారు నాకు పెళ్లి చేయాలనుకుంటున్నారు. ఈ మధ్యనే ఓ సంబంధం కూడా చూసారు అతను కాకినాడలో మెడిసిన్ చదువుతున్నాడు" యింకా ఏమో చెప్పబోతున్నంతలో, "కంగ్రాట్యులేషన్స్ ఇంకా సమస్యేముంది? అమ్మాయిగారు బుద్ధిగా పెళ్లి చేసేసుకుని అయ్యగార్ని కొంగున ముడేసేసుకుంటే సరిపోతుందిగా!" అంది విస్ఫారిత ముఖంతో, విస్ఫారిత నయనాలతో.

"ఆఁ ... ఇంకా సిగలో తురుముకోమన్నావ్ కాదు. నోర్మూసుకుని చెప్పేది జాగ్రత్తగా విను" అని మళ్లీ చెప్పటం మొదలు పెట్టింది. "నా పెళ్లి నా యిష్టం ప్రకారం జరగాలని అనుకుంటున్నాను" అంది కృష్ణవేణి.

"అంటే?" అర్థం కానట్లు కనుబొమ్మలు చిట్లిస్తూ అంది మయూరి.

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది ?

మెడ

నుదురు

రొమ్ము

వీపు

చేతులు

కాళ్లు

ఎక్కడ పేలినప్పటికి, జాన్సన్స్ ప్రిక్లిహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లిహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ● ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

● చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.

● క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది.

● చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది.

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లిహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది — తక్షణమే.




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson

"నేను ప్రేమించిన వ్యక్తితోనే నా పెళ్లి జరగాలని." ఆ మాట విన్న మయూరి రెండు చేతులతో తల పట్టుకుని "నువ్వూ ఈ వలయంలోనే చిక్కుకున్నావూ ?" అని గాఢమైన నిట్టూర్పు విడిచి మౌనంగా ఊరుకుని "కృష్ణా ! నా సలహాని పాటించాలనే అడుగుతున్నావా ?" అంది మయూరి.

"నమ్మకం లేదా ?"

"అయితే విను. బుద్ధిగా మీ వాళ్లు చెప్పినట్లు ఆ డాక్టర్నే చేసుకొని హాయిగా ఉండు. అంతకన్నా నేను నీకు సలహా ఇవ్వలేను" అంది మయూరి.

"మయూరీ. అంత తొందరగా సమాధానం చెప్పగలిగినంత తేలికైన విషయం కాదిది. కొంచెం సీరియస్‌గా ఆలోచించి చెప్పు." కృష్ణవేణి అంది.

కొంచెంసేపు మాటాడకుండా వూరుకుని తరువాత మయూరి అంది. "ఆలోచించిచెప్పటం కాదు కృష్ణా. అనుభవిస్తూ చెపుతున్నాను. ప్రేమించుకున్నాం అనుకోవటం ఒట్టి భ్రమ. బాహ్యమైన ఆకర్షణలకి లొంగిపోయి, మానసికంగా ఒకటైపోయామన్న ఆవేశం తప్ప, దాంట్లో ఆలోచన ఏమాత్రం ఉండదు. నువ్వు నా సంగతే ఉదాహరణకి తీసుకో. నేనూ నీలాగే ప్రేమించి పెళ్లి చేసుకుంటే జీవితం ఆనంద బృందావనం అయిపోతుందని పిచ్చిగా కలలు కన్నాను. నేను కోరుకున్న వ్యక్తికోసం నా వాళ్లందరికీ దూరమయాను. అనురాగంతో ప్రాణం పెట్టిన అన్నయ్యలకీ, ఆత్మీయతని పంచి పెట్టే అమ్మకీ, నా మీదెన్నో ఆశలు పెట్టుకున్న నాన్నకీ అందరికీ దూరమైపోయానిప్పుడు. కట్టుకున్న భర్త మనస్తత్త్వంతో ఎడ్జెస్ట్ కాలేక, ఎదురు తిరగలేక, రోజు కెన్నిసార్లు చచ్చిపోతూ బ్రతుకుతున్నానో తెలుసా కృష్ణా !" అని చెబుతోన్న మయూరి కళ్లు సజలాలయాయి.

"మయూరీ ! ఏడుస్తున్నావా ?" మయూరి కంట తడి చూసేసరికి మనసు కరిగిపోయింది కృష్ణవేణికి.

"ఫరవాలేదులే. అవే నాకు పిలిచినపుడల్లా పలికే ఆప్తులు." అని కన్నీటిని తుడుచుకుంది మయూరి.

"మయూరీ. నువ్వెంతో కష్టపడి చేసుకున్న అతనితో నువ్వెందుకు ఎడ్జెస్ట్ కాలేకపోతున్నావ్ ? అతనికేమైనా వ్యసనాలున్నాయా ? ఏం ?"

"అదొక్కటే తక్కువ." అని కొంచెంసేపు మాటాడకుండా ఊరుకొని, "అతనిది గొప్ప సంకుచిత మనస్తత్త్వం కృష్ణా ! ప్రతి విషయంలోనూ తనమాటే నెరవేరాలంటారు. ప్రతి చిన్న విషయానికీ పెద్ద రభస చేసేసి, భోజనంమానేసి అలిగి కూర్చుంటారు. అసలు నాకో వ్యక్తిత్వం అంటూ ఉండకూడదనే అనుకుంటారతను. పెళ్లి చేసుకున్న క్రొత్త రోజుల్లో మేం ఇద్దరమే ఉండేవాళ్లం, ఒక సంవత్సరకాలం ఇంచుమించు హాయిగానే గడిచిపోయింది. అక్కణ్నుంచి ప్రతిసారీ ఏదో విషయంలో అవహేళనగా మాట్లాడటం మొదలు పెట్టేవారు. నన్ను పెళ్లి చేసుకోవటం వల్ల తనకు రావల్సిన పదివేల రూపాయల కట్నం పోయిందట. ఇంకా ప్రతి పండగకీ అత్తవారిచ్చే కట్నకానుకలకీ దూరమయ్యారట. నేనే అతన్ని ఉద్రేకపరచి అతనినీ ప్రేమలోకి దింపానట. ఒకసారి ఆయనకి టైఫాయిడ్ జ్వరం వచ్చింది. ఆ జ్వరాన్ని చూస్తే నాకు చాలా భయం వేసింది. ఇంట్లో నేనొక్కర్తెనే. మందు కొనితెచ్చే సహాయం కూడా లేదు. అతని మనసులో ఏం పెట్టుకొన్నారో ఏమో మరి? జ్వరం తగ్గుతోందో, లేదోనని చూడటానికి వెళ్లేసరికి ఒక్కోసారి ఊరుకునేవారు కాని ... ఒక్కోసారి మాత్రం ... కళ్లెర్రగా చేసేస్తూ ... జుట్టు పీకేసుకుని ... నువ్వే నీ మంచే దూరమైపోయాను ... అయిన వాళ్లందరికీ ... ప్రాణం పోతున్నా దిక్కూ మొక్కూ లేని అనాథలా అఘోరించాల్సి వస్తోంది !" అంటూ పెద్ద కేకలేసేవారు అంత జ్వరంలోనూ. నాకు భోరున ఏడవాలి అనిపించేది. ఒక ప్రక్క అతని ఆరోగ్యం బాగులేదన్న ఆందోళన ... మరో ప్రక్క అతని మాటలకి గుండెను పిండి చేస్తున్నట్లు ఆవేదన. ఆ పరిస్థితుల్లో ఏం చెయ్యాలో ఏమీ పాలుపోలేదు. ప్రక్కవాటాలో అద్దె కుంటున్న వాళ్లని బ్రతిమలాడి మా వారి ద్వారా మా అత్తగారి ఎడ్రస్ తెలుసుకొని 'అర్జంటుగా రావలసింది' ని టెలిగ్రాం యిప్పించాను. ఆ తరువాత మా అత్తగారు, మామగారు, ఆడపడుచులు ఇద్దరూ వచ్చారు. నన్నేదో హీనమైన జంతువును చూసినట్లు వాళ్లు చూస్తుంటే నా కసహ్యం వేసింది వారిమీద. జ్వరం తగ్గిన తరువాత అతను మళ్లీ మునుపటిలాగే మారిపోక మానరు అనే నా ఆశ నిరాశే అయింది." అని కృష్ణవేణి వేపు చూస్తూ దైన్యంగా "జీవితంలో అడుగడుగునా ఎదురయ్యే సమస్యలకి పూర్తిగా లొంగిపోవటం నేర్చుకున్నాను కృష్ణా. ఇప్పుడు నేను పూర్తిగా నా వ్యక్తిత్వాన్ని చంపుకుని బ్రతుకుతున్నాను. ఈ చీర కట్టుకోవాలని కాని, ఈ సినిమా చూడాలని కాని నా కనిపించదసలు. దీనిక్కారణం ఏమిటో నువ్వే ఆలోచించు. ఆ రోజుల్లో నేనే పెద్దవాళ్లు చెప్పినట్లు బుద్ధిగా విని ఉంటే నే నిన్ని కష్టాలు పడవలసి ఉండేదికాదు. నాకేదేనా



# ర్యాలిఫాన్ డీలక్స్.
# అన్నిటికన్న మేలైనది కావాలనుకుని, దానికి తగిన ధర ఇచ్చే వాళ్ళకోసం ప్రత్యేకంగా డిజైను చేయబడినది.

ర్యాలిఫ్యాన్ డీలక్స్‌లోని ప్రతి భాగమూ సమర్థవంతంగా డిజైను చేయబడి, ఖచ్చితంగా తయారుచేయబడి, పూర్తిగా పరీక్షచేయబడినది. అది ఎప్పుడూ ఉన్నతమైన తీరులో పని చేసేందుకోసం కొత్తగా ఉన్నప్పుడే కాదు—వేలకి వేల గంటల కొద్ది పనిచేసిన తర్వాత కూడాను

- అపూర్వమైన 'బ్లేడ్ కాంటూర్' వలన ఎక్కువ గట్టిగా ఉండటమే కాకుండా, సమమైన తీరులో చల్లగా గాలి వీస్తుంది.
- ఎంతో విలుగా బాలన్సు చేయబడిన బ్లేడువలన, మోటారు పైన సరిసమానమైన బరువు పడుతుంది దీనివలన మోటారు ఎక్కువ కాలం నడుస్తుంది.
- ఏ కోణంలోనైనా సాఫీగా, నిశ్శబ్దంగా తిరిగేందుకు గాను ఖచ్చితంగా అమర్చబడ్డ ప్రత్యేకమైన స్టాండు.
- తేలికైనదీ అయినా స్థిరమైన 'బేస్' స్పీడును సరిదిద్దేందుకు గాను, తేలికగా, ముట్టుకుంటే చాలు పనిచేసే పియానో కీ స్విచ్‌లు
- ఎంచుకోడానికి 5 రంగుల్లో ప్రత్యేకమైన స్టా ఎనామెలింగ్ మరియు ఇన్‌ఫ్రా-రెడ్ బేకింగ్ పద్ధతితో ఉపరితలాలను పెయింట్ చేయడంవలన, ఏళ్ళతరబడి కొత్తగా కనిపించేలా చేస్తుంది.

అందుకే, మీరు ర్యాలిఫాన్ డీలక్స్‌కు మరికాస్త ఎక్కువ డబ్బు యిస్తున్నారంటే, నిజానికి మీరు ఉన్నత శ్రేణిలోని నాణ్యతా, ఉత్తమమైన పనివాడితనమూ, శ్రేష్ఠంగా పనిచేసే లక్షణం కోసమూ యిస్తున్నారన్నమాట.



**ర్యాలిఫాన్**

కాలానికి నిలుస్తుంది—ఎంతో అందంగా

U-RTF-17 TEL

కష్టం వస్తే, అది చెప్పుకోవడానికైనా నావాళ్లు అంటూ ఒకళ్లు ఉండి ఉండేవారు. ఇప్పుడు నేను నా బాధల్ని ఎవరిలో చెప్పుకోను కృష్ణా! చెప్పుకున్నా అందరూ ఇపుడు నాకే చివాట్లేస్తారు. ఈ విషయమై నీకు చాల

## వెలుగుబాట

సార్లు ఉత్తరం వ్రాయాలనిపించినా, ఎందుకో వ్రాయలేకపోయాను. ఒక్కొసారి జీవితం మీద విరక్తి కలిగి, ఏదేనా కొంచెం

విషం త్రాగి హాయిగా ఈ లోకం నుండి పోతే బాగుండుననిపిస్తుంది." అని మరి మాట్లాడలేక శోకపు మడుగులో భారంగా తల దించుకుని కూర్చుండిపోయిందె మయూరి.

'ఏరి కోరిన వరుణ్ణి పొంది కూడా సుఖ పడలేక, అతనితో పొత్తు కుదరక నలిగి పోతోంది మయూరి. కోరుకున్నవాడికి దూరమై, యిష్టంలేని సంసారాన్ని యాంత్రికంగా కొనసాగిస్తూ, కృంగి కృశించి పోతోంది అక్కయ్య. ఏమిటీ విచిత్రం? ఎక్కడుందీ లోపం?' జవాబు దొరకని ప్రశ్నలు కృష్ణవేణి మనసు నిండా.

"సర్లే కృష్ణా! నా సంగతి అలా విడిచి పెట్టు. నిండా మునిగిపోయినదాన్ని. నా కింకా భయం దేనికి? అన్నిటికీ సిద్ధపడే ఈ ఊబిలో బ్రతుకుతున్నాను. కాని — ఒక మిత్రురాలిగా, ప్రేమికురాలిగా నా అనుభవంతో కూడిన సలహా మాత్రం ఒకటే — పిచ్చి పిచ్చి ఆశలతో, అనవసరంగా నీ జీవితాన్ని నువ్వే పాడు చేసుకోకు. మీ వాళ్లు నిర్ణయించే సంబంధాన్ని చేసుకొని ఆనందంగా బ్రతుకు. కనీసం నువ్వయినా ముచ్చటగా కాపురం చేస్తుంటే చూడాలనిపిస్తుంది నాకు." అని వూరుకొంది మయూరి. మయూరి మాటలు విన్న తరువాత కృష్ణవేణికి ఏ బాటలో పయనించాలో అర్థం కాలేదు. ఆ రాత్రల్లా ఆలోచనలు కందిరీగల్లా ఆమె చుట్టూ రొద చేయసాగాయి. కొంతసేపు మయూరి సలహా ఎంతో అర్థవంతంగా కనిపించింది. కాని — అక్క జీవితాన్ని తలచుకొనేసరికి మాత్రం మయూరి సలహా వేపు పూర్తిగా మొగ్గు చూప లేక పోయింది. చాలసేపు అలానే ఆలోచిస్తూ ఉండిపోయింది కృష్ణవేణి. తనతో అక్కని పోల్చిచూసుకునే సరికి ఎంతో వ్యత్యాసం కనిపించింది. 'రాజు వాణి చిన్నప్పట్నించీ ఒకే దగ్గర పుట్టకపోయినా పెరిగిన వాళ్లు. ఆరు సంవత్సరాలు కలిసి చదువుకున్నవాళ్లు, రాజు గురించి అక్కకి తెలియని విషయం కాని, అక్కగురించి రాజుకి తెలియని విషయం కాని ఇంచుమించు లేదు. రాజు ఒక రోజు కనిపించకపోయేసరికి అక్క విలవిలలాడిపోయేది. అక్క ఒక నిమిషం తనతో మాట్లాడకుండా అలిగి కూర్చుంటే రాజు ఎంతగానో ప్రాధేయపడి అక్కని ప్రసన్నం చేసుకునేవాడు. అక్కకోసం రాజు. రాజుకోసం అక్క జీవిస్తున్నట్లు కనిపించే వారు.

కాని — తను గోపాలాన్నెంత వరకు ప్రేమిస్తోంది? ఇవాళే మొదటిగా ఆ ఆలోచన వచ్చింది కృష్ణవేణికి. గోపాలం గురించి తనకేం తెలియదు. అతని మనసు తనకు తెలియదు. అతడికోసం తనెప్పుడూ ఆరాట పడిపోలేదు. అతను లేకపోతే తను బ్రతక లేనని ఎప్పుడూ అనుకోలేదు కాని — ఇంత కాలం తన హృదయాన్ని ముక్కలు చేస్తున్న విషయం మాత్రం ఒకటి ఉంది. అక్కలా తను ఇష్టంలేని సంసారం సాగించరాదని అందుకోసం తనను ప్రేమిస్తోన్న గోపాలం చుట్టూ ఆశలు పెంచుకుంటోంది. కాని — గోపాలానికి మాత్రం తన గురించి ఏం తెలుసని? తన కుటుంబం గురించి ఏం తెలుసు? తన బాహ్యాకర్షణకి లొంగిపోయి ప్రేమిస్తున్నాననే వలలో చిక్కుకు పోతున్నాడు గోపాలం. అలాటి ఆకర్షణకే తనూ లొంగిపోయినంత మాత్రాన అది 'ప్రేమించటం' ఎట్లా అవుతుంది? ... ఎంత మాత్రం అవదు. అక్క రాజుని బాగా అర్థం చేసుకొని మమతల్ని పెంచుకొని విడరాని బంధం ఏర్పరుచుకుంది. అందుకే ఇప్పటికీ వాటిని చెరుపుకోలేక నలిగి పోతోంది. తనింకా గోపాలాన్ని సరిగా అర్థం చేసుకోలేదు. అతని పై మమతల్ని పెంచుకోలేదు. అలాటప్పుడు గోపాలంకోసం తన వాళ్ళందరికీ ఎందుకు దూరం కావాలి? రేపు గోపాలం కూడా మయూరి భర్తలాగే మారితే? తనేం కావాలి? తన బ్రతుకేం కావాలి? అన్న ఆలోచనలు వచ్చేసరికి భయం వేసింది కృష్ణవేణికి.

కృష్ణవేణికి ఆలోచిస్తుంటే ఇప్పుడు మరీ చిక్కు సమస్యల్లో ఇరుక్కుంటున్నట్లు కనిపించింది. మనసును కల్లోలపరుస్తున్న వింత భయాలతో తొలగిపోయింది ఆ రాత్రి.

* * *

లీజర్ పీరియడ్‌లో లేడీస్ వెయిటింగ్ హాలుకి వెళ్లిపోబోతున్న కృష్ణవేణి మయూరి నుంచి ఉత్తరం వస్తుందేమోనన్న ఆలోచన రాగానే కామన్ హాలులోకి వెళ్ళింది. అక్కడ టేబిలు మీద చాల ఉత్తరాలు పడి ఉన్నాయి. వాటిలో తనకొచ్చిన ఉత్తరాన్ని తీసుకోబో తూంటే ఆ ప్రక్కనే 'పి రామగోపాలరావు, బి. ఎస్సీ.' అన్న ఎడ్రసువున్న కవరు కనిపించింది. ఆత్రంగా తిరగేసి ఫ్రమ్ ఎడ్రస్ 'కమల' అనే పేరు కనిపించేసరికి 'కమల' ఎవరో తెలుసుకోవాలన్న ఆసక్తి, ఉత్కంఠ ఎక్కువయ్యాయి కృష్ణవేణిలో. ఉత్తరాన్ని తీసి పుస్తకంలో పెట్టి తనకొచ్చిన ఉత్తరం చదువుకుంటూ వెళ్లిపోయింది అక్కణ్నించి. సాయంకాలం ఇంటికొచ్చి, కాఫీ త్రాగి, తను చదువుకొంటున్న గదిలోకివచ్చి, పుస్తకంలో నుంచి ఉత్తరాన్ని తీసి చదివింది కృష్ణవేణి. అందులోని యీ వాక్యాలు పదే పదే ఆమెను వేధించాయి.

"నువ్వు నీభవిష్యత్తు గురించి ఆలోచించేందుకు ఇంత అవకాశం ఉండేది కాదేమో బహుశః ఒక్కటి ఆలోచించు బావా! ... నువ్వే నిర్ణయం తీసుకునే ముందయినా నువ్వెలాటి వాతావరణంలో పుట్టి పెరిగావ్. ఎవరి మూలంగా నువ్వింత వాడివయావ్? ఎంతమంది నీమీద ఆశతో బ్రతుకుతున్నారు? వాళ్లందరికీ నువ్వు చూపే దారి ఏమిటి?

అంతేకాదు బావా! .. నువ్వు నేనిలా వ్రాస్తున్నందుకు కోపగించుకోకు. నన్ను నా ఆవేదనని అర్థం చేసుకో. నాన్నగారికి ఉన్న ఆస్థి ఎంతో నీకు తెలుసు అదంతా మన ఇంటి ఖర్చులకీ, మిగతాది నీ చదువులకే హరించుకు పోయిందని కూడా నీకు తెలుసు. నువ్వు నన్ను కాని పెళ్లి చేసుకో పోతే నాన్నగారు నాకు పెళ్లి కూడా చెయ్య

## ఆవిరి అప్పడాలు

కావలసినవి : $\frac{1}{2}$ శేరు బియ్యం ($\frac{1}{2}$ కిలో) నువ్వులు ( కిలో) పచ్చిమిర్చి కావల్సినంత వుప్పు తగినంత, బాదం ఆకులు.

తయారుచేయువిధం : బియ్యం రాత్రి పూట నానబెట్టాలి. ఉదయంతీసి మెత్తగా రుబ్బాలి, వుప్పువేసి మరి రుబ్బచ్చు ఆ పిండి ఒక స్టీల్ గిన్నెలో తియ్యాలి. పచ్చిమిర్చి మెత్తగానూరి ఆ పిండిలో కలపాలి. నువ్వులు బాగుచేసినవి పిండిలో కలపాలి. తర్వాత ఆకులకు నూనెరాసి చెంచాతో కొంచెంగా ఆకుపై వేసి దోసెలాగా సర్దాలి పిండిని. (పల్చగా) అలా ఆకులపై రాసి వుంచుకుని. ఇడ్లీ పాత్రలో నీళ్లుపోసి చిల్లుల పళ్ళెంపై ఈ ఆకులుంచి ఇడ్లీని వుడికించినట్లుగా మూత బెట్టి వుడికించాలి. సన్నసెగన వుంచండి. అవి జాగ్రత్తగా వూడదీసి ఎండబెట్టండి గలగల ఎండుతయ్యి. వాటిని ఒక డబ్బాలో వేసి వుంచుకుని, భోజనంలోకి టిఫెన్‌గా వాడుకో వచ్చును చాలా రుచిగా వుంటుంది.

—శ్రీమతి సీతాలక్ష్మరాజ్ (తెనాలి)

లేని గడ్డు రోజుల్లో ఉన్న విషయం నీకు తెలియందేం కాదు. ఇలాటి పరిస్థితుల్లో నీకేది బాగుంటే అది చెయ్యి.

నువ్వు వ్రాసిన ఉత్తరం నేను నాన్నకు కాని, అత్తయ్యకుకాని, అమ్మకుకాని ఎవరికీ తెలియచెయ్యలేదు. నాకంటే ముందు వాళ్ల చేతుల్లోనే ఈ ఉత్తరం పడితే ఈపాటికి వాళ్ల గుండెపగిలి చనిపోయి ఉండేవారు!

నీ నిర్ణయం నువ్వు మార్చుకోకపోతే ఈ విషయాన్ని నువ్వు వాళ్లకి తెలియజేసేకంటే కొంచెం విషం అందరికీ పంచిపెట్టినట్లయితే, అందర్నీ సుఖపెట్టిన వాడవవుతావు. నువ్వు కూడా 'సుఖంగా' బ్రతకవచ్చు.

బావా! ఇక ముగిస్తాను. ఏం వ్రాస్తున్నానో నాకే తెలియటంలేదు. నా తల బద్దలయిపోతోంది. నా గుండె పగిలిపోతోంది. మరి వ్రాయలేను. ఒకే ఒక వాక్యం, నువ్వొక్కసారి వచ్చి, నాతో మనస్సు నిండా మాట్లాడి వెళ్లిపో ఇంతకన్నా ఇంకేం వ్రాయలేను.

ఉంటా.
నమస్సులతో—కమల."

ఉత్తరం చదవటం పూర్తయేసరికి కృష్ణవేణి హృదయంనిండా రకరకాల సమస్యలూ—సందేహాలు ఆవరించుకున్నాయి. కమల గురించి ఆలోచిస్తుంటే హృదయం ద్రవించిపోయింది కృష్ణవేణికి. ఒక్కసారిగా కమలపై చెప్పలేనంత సానుభూతి, జాలి అంతకంటె అభిమానం కలిగాయి. కమల ఈ పరిస్థితుల్లో ఎంత ఆవేదననుభవిస్తోందో ఊహించుకొనేసరికి కృష్ణవేణికి నరాల్ని పిండి వేస్తున్నట్లనిపించింది. గోపాలం తనకెప్పుడూ ఈ విషయం ఎందుకు చెప్పలేదు? తనంటే అంతగా ప్రాకులాడుతున్న కమలను ఎలా తిరస్కరించగలుగుతున్నాడు? ఇప్పుడు తనేం చేయాలి?' అందుకని, 'ఏది ఎలా జరిగినా కమలకీ, గోపాలానికీ పెళ్లి జరిగి తీరాలి! అలా జరగనినాడు ఒక కుటుంబం పూర్తిగా సర్వనాశనం అయిపోతుంది. అలా జరగటానికి వీల్లేదు!' అని నిశ్చయంగా అనుకుంది. చాలాసేపు ఆలోచించిన కృష్ణవేణికి ఆ నిర్ణయం సమంజసంగా కనిపించింది.

* * *

అక్కడక్కడా పత్రికలలో పడుతున్న కార్టూన్ల గురించి జోకులు గురించి మాట్లాడుకొని, నవ్వుకుంటూ, "మీరు నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నారా?" కృష్ణవేణి ప్రశ్నించింది. "ఇదెక్కడి జోకో?" నవ్వుతూ, అన్నాడు గోపాలం.

"జోక్. కాదు. సీరియస్‌గా అంటున్నాను" గంభీరంగా అంది కృష్ణవేణి.

"మీకెందుకా సందేహం వచ్చిందసలు?"

"ఒక అవసరమైన నిర్ణయాన్ని తీసుకోవాలి కనుక."

నరే, హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను."

"నా గురించి మీ కెంత వరకు తెలుసు?" కృష్ణవేణి ప్రశ్నలు వింతగా వినిపిస్తున్నాయి గోపాలానికి. కొంచెం సేపు ఊరుకుని "నాకు నచ్చిన గుణాలు మీలో ఉన్నాయని తెలుసు. మంచిని మెచ్చుకునే సున్నితమైన మనస్సుందని తెలుసు. ప్రతి విషయాన్ని ఎంతో తీక్షణంగా ఆలోచించే హృదయం వుందని తెలుసు. అహంకారం, గర్వం అన్నవి లేవని తెలుసు." అన్నాడు ఆ మాటలు కృష్ణవేణికేం సంతృప్తిని కలిగించలేదు.

"అవి కేవలం ఊహాకల్పనలు. వాస్తవాన్ని అనుభవంతో చూస్తేగాని దాంట్లో నిజానిజాలు తెలియవు. మీకు నాగురించి తెలియనివి ఎన్నో వున్నాయి. వాటి సంగతి విడిచిపెట్టండి. మీ విషయాలు నాకేం తెలియవు. తెలుసుకోవాలనుకోవటంలో తప్పు లేదనుకుంటాను?" ప్రశ్నార్థకంగా చూసింది. గోపాలం ముఖం వివర్ణమయింది.

"నా గురించి తెలుసుకొనటం తప్పుదనుకుంటే వినండి. నేను మీలాగా ఉన్నతమైన కుటుంబంలో పుట్టినవాణ్ణి కాను. అతి సామాన్యమైన కుటుంబంలోంచి పుట్టి పెరిగాను. మూడేళ్లు తిరకముందే తండ్రిని పోగొట్టుకున్న అభాగ్యుణ్ణి. తండ్రిపోయిన దగ్గర్నుంచీ మా మేనమామ ఆదరణలో పెరుగుతున్నాను. అతని చలవవల్లనే ఇప్పుడు చదువుకోగలుగుతున్నాను." అని మళ్లీ "నా గురించి చెప్పకోడానికింతకంటే ఏం లేవు." అన్నాడు గోపాలం.

"మీ మామయ్యగారికి పిల్లల్లేరా?"

"ఒక్క ఆడపిల్ల మాత్రం వుంది. ఇంకా పెళ్లికాలేదు."

"అచ్చా. మీరెంత అదృష్టవంతులు!"

# 5,00,000
# మంది సంతోషంగా వాడుతున్నారు!

అంటే 1,00,000 సంతోషకరమైన కుటుంబాలన్న మాట. వారు ఏ విధమైన గొడవలేని కెల్వినేటర్ రిఫ్రిజిరేటర్ కొన్నందుకు సంతోషిస్తున్నారు వారి స్నేహితులు వారి ఎన్నికను గూర్చి మెచ్చుకుంటున్నందుకు వారు సంతోషిస్తున్నారు స్పెన్సర్ వారి నమ్మకమైన సేవగూర్చి వారు సంతోషిస్తున్నారు ప్రతియొక్క కెల్వినేటర్ స్పెన్సర్ వారి పరిజ్ఞాన సేవతో తయారుచేయబడి గ్యారంటీ ఇవ్వబడుతుంది. భారతదేశమంతటా స్పెన్సర్ వారు ఖచితంగా, సామర్థ్యవంతంగా, గౌరవయుతంగా అమ్మకం తర్వాత సేవ చేస్తున్నారు మరొక దృఢత విమనగా—ఒకసారి మీరు కొన్నారంటే, మీరు మంచివాటినే కొన్నారని ఎల్లప్పుడూ జ్ఞాపకం వుంటుంది. కెల్వినేటర్ గూర్చి మీరు తలచినవెంటనే మీకు సంతోషంగా వుంటుంది.

కెల్వినేటర్ యొక్క ఇతర ప్రత్యేక అంశాలు

- ఎక్కువ స్థలావకాశం వుండునట్లు డిజైన్ చేయబడింది
- సింగిల్ మౌల్డింగ్ లైనింగ్
- మేగ్నటిక్ డోర్ గ్యాస్కెట్
- పోలాస్పేర్ కంప్రెస్సర్
- సౌందర్యపూర్ణమైన స్ట్రీమ్‌లైన్డ్ డిసైన్

## కెల్వినేటర్

286, 165, 135 మరియు 65 లీటర్ల కొలతలయందు లభించును.

## స్పెన్సర్స్

–1865 నుండి
సేవచేయుటయే
మా జీవితాశయం

## స్పెన్సర్ & కం. లి.

153, మౌంటురోడ్డు
మద్రాసు-600 002
19-ఎ, అలీపూర్ రోడ్డు, ఢిల్లీ-110 006
స్పెన్సర్స్ బిల్డింగ్
ఫోర్‌జెట్ స్ట్రీట్, బొంబాయి-400 034
డైమండ్ హార్బర్ రోడ్డు
కిద్దెర్‌పూర్, కలకత్తా-700 023

కెల్వినేటర్ రిఫ్రిజిరేటర్లన్నియు ఐ.ఎస్.ఐ సర్టిఫికేటును పొందియున్నవి.






**కావలసినవాటిని వెంటనే తీసుకోండి... స్పెన్సర్స్ వారి కెల్వినేటర్ నుండి.**

SC 171 Tel (a)




# వెలుగు బాట

"ఎందుకని ?"

"ఎందుకేమిటి ? మీరంటే అంత అభిమానంగల మామగారు, మామగారికో ఆడపిల్ల" అంటూ వుంటే ఆమె వాక్యాన్ని పూర్తి కానివ్వకుండానే "అదో అదృష్టమని నే నెప్పుడూ భావించలేదు" అన్నాడు

"ఏం ? ఆమె అందంగా ఉండదా?"

"అందంగానే వుంటుంది"

"మీకంటే చాలా పెద్దదా? లేక చాలా చిన్నదా?" కొంటెగా అడిగినట్లు అడిగింది.

"ఏం కాదు నా కంటే చిన్నదే పెళ్ళి కావలసిందే అయినా ఆమెను నేను చేసుకోను" అన్నాడు కృష్ణవేణి అనుమానం తీరుస్తున్నట్లు

"మీ వద్దరి నాకేం నచ్చలేదండి ఈడొచ్చిన అందమైన మరదలు ఇంట్లో వుంటే, మీరు ఊరూరా వెతుక్కోవటం. ఏం బాగోలేదండీ నాకు బావా మరదళ్ళ ప్రేమ, ఆ అనురాగం అంటే ఎంతో ఇష్టం నాకే వరుసలో ఒక బావ వున్నా అతణ్ణే పెళ్ళి చేసుకొని వుండేదాన్ని అయినా మీ మరదలుకూడా మిమ్మల్ని పెళ్ళి చేసుకోవా లనిపించలేదా అసలు ? విచిత్రంగా వుందే?" ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిగా చేస్తూ అంది గోపాలానికి ఆ సంభాషణ అంతగా రుచించలేదు. కొంతసేపు మౌనంగా ఊరుకున్నాడు. ఆ తరువాత "ఉన్నవిషయం మీకు చెప్తున్నాను మీరు నన్ను బాగా అర్థం చేసుకోవాలి. మా 'కమల' అంటే నా మరదలుకు నన్ను చేసుకోవాలనే ఉంది. మా మామయ్యకి నన్ను తన అల్లుణ్ణి చేసుకోవాలనే ఉంది ఇంట్లో అందరికీ ఇష్టమే. కాని కమల నేనూ చిన్నప్పట్నించీ కలిసి మెలిసి తిరగటంచేత నాకు కమల మీద పెళ్ళి చేసుకోవాలనే భావన ఎప్పుడూ రాలేదు. అందరూ మా యిద్దర్నీ కాబోయే భార్యాభర్తలుగా చెప్పుకోవటంచేత కమల మాత్రం నాకు భిన్నంగా ఊహించుకుంటుందెప్పుడూ" అని ఉన్న నిజాన్ని కృష్ణవేణికి చెప్పాడు కృష్ణవేణికి ఇప్పుడు గోపాలం అంటే ఎంతో నమ్మకం, అభిమానం ఏర్పడింది. అతన్ని ఆ పరిస్థితిలో చూస్తుంటే ఎంతో జాలి వేసింది

"మీరిప్పుడామెను చేసుకోవంటే ఏం జరుగుతుంది ?"

# టినోపాల్* ఇప్పుడు ఓ కొత్త పేరుతో

# రానిపాల్



రానిపాల్+
నూలు దుస్తులకు




రానిపాల్+ ఎస్
సింథటిక్ మరియు
మిశ్రమ దుస్తులకు




**ఉత్పాదన అదే, పనితనం అదే, కాని పేరు మాత్రం కొత్తది.**

## సర్వోత్తమ తెలుపు కోసం రానిపాల్+

**Suhrid Geigy**
LIMITED

+ సుహృద్-గైగీ లిమిటెడ్ వారి ట్రేడ్ మార్క్ * ఇంతకు పూర్వం సిబా-గైగీ లిమిటెడ్ వారి లైసెన్సు క్రింద అమ్మబడేది.

Shilpi SGT 6A/76 tel

# వెలుగు బాట

కొంతసేపు సమాధానం చెప్పలేక పోయాడు

"మీరు నన్ను క్షమించగలరంటే ఒక్క విషయం." గోపాలం వేపు అనుమానంగా చూసింది గోపాలం రకరకాలైన భావాలు మనసులో చెలరేగుతోంటే ఆత్రంగా చూడ సాగాడు ఏంటన్నట్లు

"మొన్న మీకీ ఉత్తరం వచ్చింది 'కమల' అనే పేరు చూసి ఎవరోనని మీ ఉత్తరం చదివాను నా స్వార్థం కోసం. మీకు కమల వ్రాసిన ఉత్తరం ఇది చదువుకోండి" అని దోషిలా తల వంచుకుని ఉత్తరాన్ని గోపాలం చేతి కందించింది గోపాలం కృష్ణవేణినే ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాడు కృష్ణవేణి మరోసారి క్షమించమని వేడు కొంది ఆత్రంగా ఉత్తరాన్ని అందుకుని చదువుకోసాగాడు గోపాలం వివర్ణమవుతున్న. అతని ముఖాన్ని గుర్తిస్తూనే ఉంది కృష్ణవేణి ఉత్తరం చదవటం పూర్తిచేసి ముఖాన ఉన్న చెమటను రూమాలుతో తుడుచుకొని మాటాడకుండా ఉండిపోయాడు.

"కమల ఎంత ఛిత్రక్షోభకు గురైపో తోందో చూసారా? మీరే చెప్పండి సాటి స్త్రీగా నా కర్తవ్యం ఏమిటిప్పుడు? నా స్వార్థం చూసుకుంటానా? మిమ్మల్నే నమ్ముకుని ఉన్న మీ వాళ్లందరూ మన ఆశయాలకూ, ఆదర్శాలకూ బలైపోవాల్సిందేనా?" కృష్ణవేణి అంటున్న మాటలు వింటూ తల వంచుకుని కూర్చుండి పోయాడు గోపాలం. కృష్ణవేణి మళ్లీ ఏవేవో చెపుతోంటే, "అయితే ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు? ఇష్టంలేని పెళ్లి చేసుకొని, నన్నూ, నా ఆశయాల్ని వాళ్ల కోసం బలైపోమంటారు? కమలని నేనో చెల్లెలుగా ఊహించుకున్నానే తప్ప కాబోయే భార్యగా ఎప్పుడూ ఊహించుకోలేదు. ఇపుడు అలా కాదనుకొని ఎలా చేసుకోను?"అన్నాడు బాధగా "క్షమించండి నేనూ మిమ్మల్ని ఒక అన్నయ్యలాగే చూడగల్గుతున్నాను తప్ప, పెళ్లి చేసుకుందామనే భావనతో ప్రియుణ్ణి చూస్తున్నట్లు చూడలేకపోతున్నాను." అంది గోపాలాన్ని ఎలాగైనా మార్చాలని. గోపాలం ఆవేశంతో లేచిపోయాడు. "కృష్ణవేణి గారూ! మీరేం చెప్పనవసరంలేదు. మీరు నాకిపుడు పూర్తిగా అర్థమయారు మీకూ మాకూ ఏ యుగంలోనూ పొత్తు కుదర లేదు మీకు ఆస్తి, అంతస్తూ ఉంది మాకేం లేదు ఈ హెచ్చు తగ్గుల్ని నాకు చెప్పడానికి ఇన్ని డొంక తిరుగుళ్ళు దేనికి?" అని అక్కణ్ణుంచి వెళ్లిపోబోతున్న గోపాలం చెయ్యి పట్టుకుని బలవంతంగా కూర్చోపెట్టి, "ఆవేశపడిపోకండి! నేను చెప్పేది జాగ్రత్తగా వినండి మనం ఊహించు కున్నవి జరగనపుడు మనకు ఇతరులు చేసే ప్రతి పనిలోనూ వ్యతిరేకతే కనిపిస్తుంది కాని అప్పుడే మనిషి తెలివి తేటలతో జాగ్రత్తగా ఆలోచించాలి ప్రతి విషయాన్ని. ఇంత వరకూ నాకు అహంకారం, గర్వంలేవని మీరే అన్నారు మీకు వ్యతిరేకమైన జవాబు నానుండి వచ్చేసరికి అప్పుడే మీరు నన్నపార్థం చేసుకుంటున్నారు ఆస్తి, అంతస్తుల్నీ నేనెప్పుడూ పట్టించుకోను. కాని ఒక విషయం మీరే బాగా ఆలోచించండి కమల మిమ్మల్ని బాగా ప్రేమిస్తోందని తెలుసు. మీ కుటుంబ ఆర్థిక పరిస్థితులు మీకు తెలుసు ఈ పరిస్థితుల్లో మీరు కమల్ని చేసుకోనంటే మీ మామయ్యగారు కమలకి మరి పెళ్లిచెయ్యలేని సంగతికూడా మీకు తెలుసు ఇన్ని తెలిసి మీరు మూర్ఖంగా, మొండి పట్టుదలతో ప్రవర్తించటం ఎంత అర్థరహితంగా కనిపిస్తోందో మీరే ఆలోచించండి. ఆశయాలు, ఆదర్శాలు ఉండొచ్చు అవి ఎదుటివారి జీవితాన్ని ధ్వంసం చేసేవి కాకూడదు" అని మరి కొంత సేపు నిశ్శబ్దంగా ఉండిపోయి మళ్లీ ఇలా అంది

"మీరెంత ఆవేదనతో సతమతమైపోతు న్నారో నాకు తెలియందేం కాదు. మీరు ప్రేమించిన స్త్రీని వివాహం చేసుకోవటం కంటె, మిమ్మల్ని కోరుకున్న స్త్రీ పొందులో మీరెంతో ఆనందాన్ని అనుభవించగలరు మీకు నేను చెప్పేపాటి దాన్నేం కాను అయినా నాకు తోచిన విధంగా చెప్పాను కమలని మీరు చేసుకొంటే నేనెంతో సంతోషిస్తాను" అని వూరుకుంది. ఎంత సేపటికీ గోపాలం నుండి సమాధానం లేకపోయేసరికి, "సరే బాగా ఆలోచించండి. మిమ్మల్ని నేనేం బలవంతం చేయలేను కాని కమల మీకు కానపుడు నేనూ మీకేం కాను వస్తా" అంటూ లేచిపోయింది. గోపాలం మాటాడకుండా అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు

మూడు నెలల తరువాత —

గోపాలం తన పెళ్లి శుభలేఖను కృష్ణవేణి చేతి కందిస్తూ, "తప్పక రావాలి! మిమ్మల్నిప్పుడే చూసెయ్యాలని కమల ఆరాటపడి పోతోంది" అన్నాడు.

"తప్పకుండా" సంతోషంతో ఉప్పొంగి పోతూ అంది కృష్ణవేణి

"మరి మీ 'శుభలేఖ' ఎప్పుడిస్తారు?"

"త్వరలో"

అప్పుడే సంధ్య చీకటి తెరల్ని తొలగించు కొని వస్తున్న చందురుని లేవెల్గులు వాళ్లు నడుస్తున్న బాటని కాంతి వంతం చేసాయి.

[ అయిపోయింది ]

---

## అవీ — ఇవీ — అన్నీ

### రష్యాలో క్రీడా పత్రికలు

మాస్కోనుంచి 15 క్రీడా పత్రికలు వెలువడుతాయి వీటి మొత్తం సర్క్యులేషన్ 6,000,000 కాపీలు ఈ క్రీడాపత్రికల్లో దిన పత్రికలు, వార పత్రికలు, మాసపత్రికలు వున్నాయి

దినపత్రిక పేరు 'సోవెత్‌స్కి స్పోర్ట్స్'యీ దిన పత్రిక 1924 నుంచి వెలువడుతూ వుంది ప్రపంచంలో దీనికి వున్నంత సర్క్యులేషన్ మరే క్రీడా పత్రికకూ లేదు ఈ పత్రిక సర్క్యులేషన్ మొత్తం 3,900,000 ఇది మాస్కోతో సహా 35 నగరాల నుంచి సంయుక్తంగా ప్రచురింపబడుతుంది

1980 లో మాస్కోలో 22 వ వేసవి ఒలింపిక్ ఉత్సవాలు జరుగనున్నాయి దీనికోసంగానూ ప్రత్యేకంగా 1975 ఆరంభంనుంచి ఒక క్రీడా వారపత్రిక ముద్రింపబడుతూంది ఈ పత్రిక పేరు 'స్పోర్టివ్నాయ మాస్క్వ'

### శ్రీ మలయాళస్వామి జీవిత చరిత్ర

సాహిత్య శిరోమణి శ్రీ సముద్రాల లక్ష్మణయ్య రచించిన మహర్షి – సద్గురు శ్రీ మలయాళస్వామి జీవిత చరిత్ర మా కార్యాలయం చేరింది 424 పేజీలు గల ఈ గ్రంథం వెల 6 రూపాయలు ప్రతులకు మేనేజరు, శ్రీ వ్యాసాశ్రమము, శ్రీ వ్యాసాశ్రమం పోస్టు, ఏర్పేడు మార్గం, చిత్తూరుజిల్లా

సోనార్ బంగ్లా, ఇక్కడ పెళ్లి చేయబడును

రెండు నాటికలు రచన శ్రీ కె చిరంజీవి హైదరాబాద్ అరసం తొమ్మిదో ప్రచురణ 68 పేజీలు వెల రెండు రూపాయలు

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street,

అనంతలక్ష్మి కంబైన్స్

# ఈ కాలపు పిల్లలు

